కల్పవల్లి ప్రచురణలు
చతుర్థ మంజరి

శ్రీః

# సుందరేశ్వర విలాసము



బ్రహ్మశ్రీ చెరువు సత్యనారాయణశాస్త్రి

కల్పవల్లి ప్రచురణలు
చతుర్థ మంజరి

శ్రీః

# సుందరేశ్వర విలాసము



బ్రహ్మశ్రీ చెరువు సత్యనారాయణశాస్త్రి

ప్రథమ ముద్రణ : బహుధాన్య సంవత్సరము
ఆశ్వీయుజ శుద్ధ( ౧౦ ) దశమి
1-10-1998

ప్రతులు : 1000

వెల : రూ. 15/-

ప్రతులకు : 1. చెరువు లక్ష్మి
W/o Dr. బ్రహ్మశ్రీ చెరువు సత్యనారాయణ శాస్త్రి
35-5/2, తణుకు - 534 211
పశ్చిమ గోదావరి జిల్లా

2. సాధన గ్రంథ మండలి
తెనాలి - 522 201

*This Book is published with the Financial Assistance of*



D.T.P. by
*MR LASER PRINTS*
CHIRALA - 523 155
✆ 36074

Printed at:
GEETHA & COMPANY
Kothapet
CHIRALA - 523 157

# పుష్పాంజలి

ఆశుకవితావిశారదులై సాహిత్యలోకమున 'అవధానవిద్యావాచస్పతి' 'ఉభయ భారతి' మొదలైన బిరుదులు అందుకొన్న కీ.శే. బ్ర.వే. డాక్టర్ చెఱువు సత్యనారాయణ శాస్త్రిగారు నూటికిపైగా సంస్కృతాంధ్రములలో అష్టావధానములు చేసి, సంపూర్ణ సంస్కృత శతావధానము నిర్వహించి, అపూర్వమగు ధారా, ధారణములతో పండిత ప్రకాండుల ప్రశంసలందు కొన్న కవిపుంగవులు. విచక్షణతోగూడిన వీరి విలక్షణమగు వాగ్ధోరణి సాహితీ మూర్తులకు వరవడిని దిద్దినది. పూర్వ కావ్యములలోని పద్యములకు క్రొంగ్రొత్త స్వారస్యములను వెల్లడించినది.

శ్రీ శాస్త్రిగారు మాతృవియోగానంతరము తమ 4వ ఏట నుండియు మాతామహులైన బ్ర.వే.తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి (చందోలు) గారి శిక్షణలో మాతామహి శ్రీదేవి గారి సంరక్షణలో పెరిగి పెద్దవారై, విద్యాబుద్ధులు గడించి, నాటకాంతము సాహిత్యము నభ్యసించి, సంస్కృతాంధ్ర కావ్యరసమాధుర్యములను ఆస్వాదించి, వేదాధ్యయనపరులై శివార్చనాశీలురై శ్రీరుద్రాభిషేక పూజా విధులచే చిత్తైకాగ్రతను సాధించి, శ్రీ విద్యోపాసకులై, మంత్రశాస్త్రరహస్యములను అవగతము చేసుకొని, ఆగమవేత్తలై యాగాది విధులందు ప్రావీణ్యము పొంది, భాష్యాంతవైయాకరణియై శబ్ద ప్రపంచమును దర్శించి, ప్రస్థాన త్రయము శాంతిచేసి, వేదాంత తత్త్వము ననుభవమునకు తెచ్చుకొన్న మహామనీషి. ధైర్య, గాంభీర్యాది గుణములు వారికి పెట్టని సొమ్ములై విలసిల్లినవనుట అతిశయోక్తి కాదు.

శాస్త్రిగారికి పూర్వజన్మసంస్కార విశేషముచేత చిన్నతనమున 7వ ఏటనుండియే ప్రతిభాసంపన్నమైన కవితావైభవము అప్రయత్నముగ సిద్ధించినది. వీరు పది, పదకొండేండ్ల వయస్సున గజేంద్ర మోక్షణకథ 'కరిమకరీయ'మను పేర వెలయించిరి. 15వ ఏట ఉమాకల్యాణము, 17వ ఏట విప్రలబ్ధ, 19వ ఏట ఈ సుందరేశ్వర విలాసము రచించి ఆంధ్రభాషాసరస్వతిని విశిష్టకావ్యకుసుమములతో సుందరముగా నలంకరించిరి. ఇవికాక ఆ సుకృతి అప్పుడప్పుడు చేసిన మరికొన్ని లఘుకృతులు (సంస్కృతాంధ్రములు) ప్రకృతమున **కవితావతరణమను** పేర ప్రకటితములై సహృదయుల ఆదరాభిమానములకు పాత్రములైనవి. 'చెరువు వారి సుబ్బలచ్మి' శతకము వారి జానపదభాషాప్రయోగవైచిత్రికి. ప్రక్రియావైవిధ్య సంపాదనమున వారికి గల అభిరుచికి తార్కాణము. పదము, పాట, పద్యము, గద్యము, గేయము, వచనము, సాహిత్యరూపకము, అవధానము, శతకము, కావ్యము, నాటకము, విమర్శ ఈ విధముగ ఏప్రక్రియనైనను సమర్థవంతముగ నిర్వహింపగలదిట్ట శ్రీ శాస్త్రిగారు. వీటన్నింటికి ఉదాహరణములగు కృతులు వారి సాహితీవ్యవసాయమునకు ఫలసాయములుగా దర్శనమిచ్చు చున్నవి. ప్రతికాదంబరి, మందారమంజరి మొదలగునవి వారి సంస్కృతగద్య కావ్యములు-వీటన్నింటితోబాటు 'మాఘకావ్యము-అనువాదములు-అనుశీలనము' అను అంశముపై పరిశోధనచేసి ఆంధ్రవిశ్వవిద్యాలయమునుండి పిహెచ్.డి. పట్టము పొందిరి. ఇందు మాఘకవి సర్వంకషప్రజ్ఞ సమగ్రముగ ప్రకటించిన విధము శాస్త్రిగారి విజ్ఞతకు నికషోపలమై నిలచినది.

# సుందరేశ్వర విలాసము - కథాంశము

సంస్కృతమున బాణుని కాదంబరివలె, తెనుగున సూరన కళాపూర్ణోదయమువలె నిందు మూడు జన్మల వృత్తాంతము ముచ్చటింపబడినది. అనల్పకల్పనా శిల్పమును ప్రదర్శించు నీ కావ్యము శాస్త్రిగారి ఇతివృత్తనిర్వహణమునకు నిదర్శనము-వీరిశైలి ప్రబంధ ఫక్కినమసరించి ప్రౌఢమై, నిరర్గళ నిర్ఝరవారి ధారాప్రవాహ సదృశమై, రసైకతానమై, వర్ణనా బహుళముగ దోచును.

భారతీయ సంస్కృతి, వేదశాస్త్ర సంప్రదాయముల ననుసరించి, పురాణ వాఙ్మయమునందు భగవంతుని ప్రసిద్ధమగు దశావతారములు వర్ణింపబడినవి. భాగవతమునందు విశేషముగ ఏకవింశతి(21) అవతారములు చెప్పబడినవి. ఇవి కాక, పుణ్యాత్ములగు భక్తుల కోరికలు మన్నించి భగవంతుడాయా సందర్భములందు వారి సంతానమై యవతరించి, ముద్దుమురిపెములు చెల్లించుచు, శిష్టరక్షణ, దుష్టశిక్షణ ధర్మపరిపాలనాదుల నెఱపుచు లీలామానుషవిగ్రహుడై వర్తిల్లిన విలాస విశేషము లనంతములై వినవచ్చుచున్నవి. అట్టి వానిలో ఈ సుందరేశ్వర విలాస మొకటి.

ఉత్కల దేశాధీశుడగు 'ప్రియరూపుడు' ఉద్గీథముని యాగ సంరక్షణ బాధ్యత వహించి, క్రతు విధ్వంసకులైన ముద్గరాది రాక్షసులను అమితవిక్రమమున సంహరించి, రెండవ 'దాశరథి'గా కీర్తింపబడి, అనన్య సాధ్యమగు శుకయంత్రమును భేదించి, మధురాధిపతి యగు ఉరుయశునకు లక్ష్మీ వర ప్రసాదమున జన్మించిన 'మణిమాల'ను వివాహమాడుట, ఉరుయశుని కుమారుడు 'గిరీశ ప్రసాదదత్తుడు', పాండ్య దేశాధిపతి మలయధ్వజునకు, పార్వతి యనుగ్రహముచే, యజ్ఞకుండమున పుట్టిన బాలిక, వివిధ శస్త్రాస్త్ర ప్రయోగ కుశలయై, వీర్యశుల్కయగు **'తటాతక'**ను యుద్ధమున జయించి వివాహమాడుట, ఇందు విపులముగా వర్ణింపబడినది. ప్రబోధ చంద్రోదయమువలె పరతత్త్వబోధకమైన దివ్య ప్రబంధమీగ్రంథము.

ఇందు కావ్యమున నుండ వలసిన వివిధ వర్ణనములు వినూతనభావ సుందరములై మనోహరములై విలసిల్లు చున్నవి. కథాసంవిధానము, రసపోషణ, పాత్రచిత్రణాదులు ఉదాత్తములై పఠితల హృదయములకు ఆనందమును కలిగించుచున్నవి. ఇందలి సాహితీవిశేషములకు ప్రతిపద్యమొక ఉదాహరణముగ నెన్నదగియుండియు గ్రంథ విస్తర భీతిచే నే వివరింపక కవితా తత్త్వజ్ఞులగు సహృదయులకే విడిచి పెట్టుచున్నాను.

దోషరహితముగా ఈ గ్రంథము వెలువడుటలో చేయూత నిచ్చిన శ్రీ జొన్నలగడ్డ జానకి రామయ్య (రిటైర్డు సీనియర్ తెలుగు పండిట్, పొన్నూరు) గారికి కృతజ్ఞతలు.

"ఎందరో మహానుభావులు అందరికి వందనాలు"

**డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి, రీడర్**
శ్రీ భావనారాయణ స్వామి సంస్కృత కళాశాల, పొన్నూరు, గుంటూరు జిల్లా.

శ్రీమత్పరాంబికాయై నమః

# సుందరేశ్వర విలాసము

## ప్రబంధాది పద్యములు

శ్లో॥ శ్రీ రాజత్కర మప్రమేయ విభవం ద్వైమాతురే మాతురు
త్సంగే సంవసతి ప్రసారయతి చ స్మేరాంకురోద్య న్ముఖే।
గ్రీవాయాం సభయో నదే సహముద శ్శైషే సకారుణ్యాక
స్స్వాశంకః కబరీభరే సచకితో వస్త్రే విభుః పాతు నః॥

సిరిగల పేరురమ్ముగల చిందముదాలుపు, వేల్పుకాపు, బి
త్తరి గల సాము మేనెసఁగుతమ్ముల గొంగసగంబుదాల్పు, వా
గరితగలట్టి మోమెసఁగుగాడుపు మేపరిపాన్పు పట్టి, పె
ల్లరుసము నెమ్మదిన్మెయికి హాయిని నాల్కకుఁబల్కొసంగుతన్

జింకచెయివంక, నౌదల
వంక న్నెలవంక, గుత్తి వంక న్విసమున్
బొంకమిడుచుండు, మరుచల
మింకించిన సామి యోము నీ కబ్బమ్మున్

దిట్టతనంబు గట్టి పువుతేనియ సోనల నీను కైతరాఁ
బట్టి, దొసంగుల న్నిసువు బల్కుల మెచ్చగ రాని వాని బోఁ
గొట్టి, యెడంద ఁబుట్టు పలుకోరికలన్నిటిముందు వెట్టి, యా
గట్టుల జేనిపట్టి, మముఁగాచుతఁ గబ్బమునందలంచెదన్

సిరితనయాలుగా, పులుఁగు సింగము యెక్కుడుగాఁగ, పాలసం
దరము బిడారుగా జగము తాతకొమారుడుగాఁగ, గాలిమే
పరియొడయండు క్రొత్తపువుపానుపుగాఁగ నెసంగు నయ్యవా
రరయుత మమ్ములం గనికరంబున పంబినబత్తిఁగొల్చెదన్

పలుకు గలయట్టి చోటఁదా నిలువఁబోదు
తా నిలుచు చోటఁబలుకుకు ఁదావొసంగ
దట్టికోడలి కయ్యంబు నెట్టి వైచి
నన్నుఁజేరంగ సిరినెప్పు డెన్నికొలుతు

నలుమొగంబులంబ్రాఁ జదువులఁజదువుచు,
బమ్మరుసులెల్లఁదనచుట్టు గ్రమ్మియుండఁ,
దమ్మిపూదిమ్మెపై నుండు తమ్మిచూలి
నెమ్మనమ్మునఁగొల్తు నే నమ్మి యెపుడు

ఏయమ్మఁదెలిచిన నీరేడు జగముల
నెనయరాదిదియంచు ననఁగరాదు
ఏయమ్మ నమ్మిన నా యీ యనక యన్ని
విద్దెలందును దెల్వి వెలయుచుండు
నేయమ్మ దయఁజూడ నేకూళయును పెద్ద
పెద్దతికంబునఁబెంపునింపు
నేయమ్మ ఁజెందిన నెవ్వాఁడు నీ పుట్టు
చావుల నెనయంగఁబోవఁడెప్పు

డౌసలువరాణి, యంచపైనలరుదానిఁ,
జిలుక నెసఁగెడి డాపలిచేతిదానిఁ,
జల్లచూపులఁబైపయింజల్లు దానిఁ
గొలిచి వేఁడెదఁబలుకులకులుకులాఁడి



శ్రీః

శ్రీమత్పరాంబికాయైనమః

# సుందరేశ్వర విలాసము

## ప్రథమాశ్వాసము

ఏదేవికనుసన్న లీరేడు జగముల
సృష్టిసంస్థా లయ స్థితుల నెఱపు
నేతల్లిపాదకంజాతముల్ నిఖిల లే
ఖ కిరీట కోటి సంక్రాన్తిఁదనరు
నేసతి కరుణావిలాసముల్ భక్త వాం
ఛా పరి పూరణ చణతవెలయు
నేయమ్మరూపమామ్నాయ శిరోభాగ
భాగభాగ ప్రాభవమున మెఱయు
ఆపరాత్పర నిగమాగమైకవేద్య,
నవ్యయననన్తనేకరసాత్మనిత్య
సచ్చిదానందరూప నిశ్చలవిభూతి
నాదిశక్తిని నెమ్మనమందుఁదెలఁతు 1

అందము చిందునెంతయు, నిరంతర బంధుర గంధవాహ సం
స్పందిత కోరక ప్రసవపంక్తి సుగంధ మనోజ్ఞ బాల మా
కంద మరంద పాన మద కందలితాలిసమూహగీతికా
నందితలోకమౌనుపవనంబిల రెండవ నందనం బనన్ 2

ఆయెలదోటసోయగమునారసి, యందుఁ జరింపునిచ్చ లోఁ
బాయమిఁజేసి సంతతనివాసరతిన్ గొమరొప్పు చంద్రు బ్రా
హ్మీయుతుఁడౌచు బ్రహ్మయు, రహింబురుషోత్తముఁడెందుమాధవీ
శ్రీయుతుఁడై, శివాలలిత శీలుఁడు త్ర్యంబకుఁడు న్సుఖోన్నతిన్ 3

సిరి సొంపార నితాంతసంభృతమధుస్థేమన్ నవోద్యత్సుమో
త్కరమందందమెఱుంగులీనఁగ నశోకస్ఫీతవిధుల్ వికఁ
స్వరకార్త స్వరపుష్ప భాస్వరతరాంచత్ప్రాంచలంబౌ వనేం
దిరపైఠాణి చెఱంగురంగునఁగడున్ దీపించు రమ్యాకృతిన్ 4

భానుఁడు మధ్యందినమునఁ
గానఁడు, నిజరథ్యములప్రకారంబుఁదదు
ద్యానానోకహ హరిత ద
ళానూన మరీచిరోచులాకసమెలయన్ 5

కుసుమిత మంజు వంజులనికుంజములున్, నిబిరీసమల్లికా
విసర గుళుచ్ఛముల్తగనవేలదళ న్నవమాలికా నవ
ప్రసవములున్, మరంద మధుపాన విమత్త మధువ్రతాంగనా
ప్రస్రుతసుగీతముల్, మివుల రాణ దనర్చునుదద్వనంబునన్ 6

అనయంబునొగిరాలు ననగమిచే నకృ
త్రిమములై దనరు విరిపఱుపులును
యలవోకఁదగజాలు నలరుఁ దేనెలనిండి
జాలువ ఱెడు నాలవాలములును
కస్తూరికామృగ ప్రస్తావ మృగనాభి
గంధబంధురశిలా ఖండములును
సారవ సారస హంసకారండవ
చక్రచక్రములు కాసారములును
లలిత లవలీ లవంగకైలా మధూక
వకుల నవమాలికాసింధువారకర్ణి
కార శేఫాలికా సహకారబంధు
జీవముఖ్యములెసఁగునాబూవుఁదోట 7

రక్త శతపత్త్ర కుముద పరాగ రాగ
ఘటిత మధు గంధికాసార తటమునొిదు
మంజు నవమాలికాలతా మండపమునఁ
జలువఱాఁ జప్పరమునఁగెందలిరుసెజ్జ 8

యువమిధునమొుండు, దివ్య మ
ణి విభూషణములఁదనర్చి, నెమ్మిం బుష్పా
సవముల నెడనెడ గ్రోలుచుఁ
దవిలెన్ ద్యూతోత్సవమునఁదమకం బెసఁగన్ 9

ఆనెఱి గొంతప్రొద్దు సన నన్నవపూరుషుఁడానెలంత ను
ద్యానవిహారకౌతుకవశాత్మ గనుంగొని లేచి కేలఁగే

ల్బూని తెమల్చి, యింపెసఁగ ఫుల్ల సరోజదళాయతాక్షి, కా
కానన కామనీయకము కన్నుల పండువుగాగఁజూపుచున్ 10

పొదరిండ్లకునేఁగుచు, ఁదు
మ్మెదలకునీఁగుచు, మలయసమీరమునకుఁదా
మెదురేఁగుచుఁబొద డాగుచు
మది యలరఁజరించిరి సుమ మధువులఁగొనుచున్ 11

అటులవ్వని విహరింపుచుఁ,
జటులాలక గాంచెనొకరసాలమునందున్
విటపాన్తరగతమై ప్ర
స్ఫుటకలరవములనెసంగు శుకమిథునమ్మున్ 12

అంతంబద్మపలాశలోచన, తదీయస్నిగ్ధసౌందర్య మ
త్యంతామోదము గూర్ప, ఁదత్కలరవవ్యాపారముల్వీనులన్
సంతర్పింపఁగఁజొక్కి, తద్గ్రహణ వాంఛాబద్ధయై, యొయ్యనం
గాంతుం జీరెను, జేరఁదెల్పెను నిజాకాంక్ష న్మనోజ్ఞమ్ముగన్ 13

సహకారముఁజూచితివా?
విహాయస మలంకరించు విరులఁజివురులన్
సహచర! కనుగొంటివె యం
దహంయు శోభములు శుకములవి మెచ్చితివే 14

వాంఛితపూరణప్రియ
భావా! వలదనకు నాదువాక్యము నాకుం
గావలె నా రాచిలుకులు
తేవలయును బోయి నీవు తిరముగ వానిన్ 15

అనినం దత్ప్రియవల్లభుండనును, రాకాబ్జాస్య! పోఁజెల్లునే
మనకుం దద్గ్రహణేచ్ఛ, హేమమృగసంబద్ధాదరుండైన రా
ముని పాట్లు న్వినమే, దలంపనివి యేభూతమ్ములో యిట్టి రూ
పున వర్తిల్లెడు గాని, కావివి శుకమ్ముల్, మాట లింకేటికిన్ 16

అనిన నొప్పక యాయింతి యాత్మనాథుఁ
బంపెఁగిరమ్ములకు నాఁడువారలెందు
ముందువెన్కలు గాన రేప్రొద్దు తాము
పట్టుకుందేటికి న్మూఁడె పదములంచు 17

అంతనక్కాంతుండు ప్రియతమావచనంబులు దప్పనేరమింజేసి, యెట్ట కేలకు నొడంబడి యప్పఁడతిమిన్న నొక్కలేమావిగున్నక్రిందంబటికం పుజాతిన్నె పయిం బ్రతీక్షింప నియమించి, రసాలసాలముదరి జేరియొడిసి పట్టఁజివురుఁ జొంపమ్మునకుంగేలుసాచ, నక్కిరంబు లాకసంబున కెగసియు నెగయక శాఖాంతరమ్ముల నాక్రమించియు నాక్రమించక, యిలకు డిగి యుం డి గక యాకు జొంపమ్ముల డాగియుడాగక, నికుంజమ్ములకెక్కియు నెక్కక చేతికంది యునందక, యేక పదమాత్రగ్రాహ్యమ్ములయ్యునతివాహితానేక పదమ్ములై, యిట్టట్టుసేసి విసువు పుట్టింపఁబట్టువిడువక, బింబ ఫలంబుల జూపి యాస గొలిపియు, బరిపక్వదాడిమీబీజముల జల్లియువ లాలించియు, జంబూ ఫలంబుల నెడఁజల్లి పిలిచియు రసాలములనిచ్చి మచ్చికసేసియు,ఁ జెట్టుచేమ లెక్కియుఁబొదరిండ్లఁబొంచియు నుత్తరీయము నవలవైచియు నింకఁబలుపాట్లు పడియు బట్టుకొన నశక్తుండయి లలాటం తపమ్ములగు తపన కిరణముల గందియు నధ్వశ్రమంబునఁ గుందియు నాశకుంతంబులచే సుదూర మపహృతుండయి విసిగివేసారి యయ్యవి నయన పథాంతరితంబు లయి నంత వెనుదిరిగి ప్రాణప్రియ నన్వేషించుచు నేతెంచి లేమావి క్రిందనా చెలువం గానక చిత్తముత్తలంపడఁజెట్టుచెట్టుకుం జేమ చేమకుం బుట్ట పుట్టకుం దిరుగాడుచు నెందునుం గానక,

నా పయినల్క బూనియెటనక్కెనొయన్న బయోరుహాక్షి దాఁ
గోపము నూనదింతవఱకుం జనెనో యెటకైననన్నఁదా
నోపదు గాన నన్విడచియుండ క్షణంబొకడైన, హో విధీ!
యేపగిదింగడంతునొకొ యింతినిఁబాసి శుగర్ణవంబిఁకన్ 19

ఏల యీపూఁదోట యిలకెల్ల నధిక సౌ
న్దర్యమై మాకు గన్పట్టవలయుఁ
గనుపట్టెఁబో యంతటనుబోక యేల యీ
యలరుఁదోటను జూదమాడ వలయు
జూదమాడితిమిబో గాదని మదియేల
బుప్పుఁదోట విహరింపఁదవుల వలయుఁ
దవిలెబో యీశుకద్వంద్వంబె మాకేల
కన్నులబండువై గ్రాలవలయుఁ
గ్రాలెబో యేల యీబేల మేలమాడి,
కొదమ చిల్కలఁబట్టంగఁగోరవలయుఁ
గోరెఁబో యేల నేను నాకువలయాక్షి
యభిమతం బొనగూర్చుట కరుగవలయు 20

అనిచింతించును, బల్వరించు, మది నయ్యబ్జాతనేత్రం దలం
చును హా యెక్కడ డాగితంచు విలపించున్, వీడి నన్నేగ వ
చ్చునె ప్రాణప్రియ! యంచు నశ్రుల నిగుడ్చుం గన్నులన్ బిట్టుదూ
ఱును దైవోపహతింగలంగి పలుమాఱుంజూచు నల్దిక్కులున్ 21

చెట్టుకుఁజెట్టుకు, న్మతియుఁజేమకుఁజేమకు, ఁబుట్ట పుట్టకున్
బిట్టువిరాళిహెచ్చి, మది బెన్గొన, నాత్మసతీవియోగముం
బట్టగ లేక, తాల్మిసెడి పర్వులు వెట్టెను లేమ యెందుఁగ
న్పట్టు నటంచు, నావిల మనస్కతనాతఁడు తద్వనంబునన్ 22

అట్లు తిరిగి తిరిగి యలసి మున్నాదమ్మ
నాడినట్టి నెత్త మరసి యరసి
యందునింతిఁగనక డెందముత్తలమంద
మూర్ఛనొందె, నవ్య పూరుషుండు 23

అంత ఁగొంతకు, సంతతస్యంది శిశిర
కుసుమనిష్యంద బిందు సంప్రస్నృత మహిత
మధుర సౌరభ్యవహ మందమలయ పవన
వీచికా డోలికల నుపవీజితుఁడయి 24

ఎట్టకేలకుఁదెలివొంది వెట్టవెలుగు
వేడివెలుఁగులు మిటమిట వెలుఁగుచుండ
నల తిదప్పిక బెనుఁగొన నతఁడు జలజ
షండమండితమౌ జలాశయము నెనసె 25

ఆపద్మాకరమున డిగి,
తాపంబాఱంగఁదోగి, తత్సలిలముఁదృ
ష్ణాపరతఁద్రావినంతనె,
యా పురుషుండద్భుతముగ నంగన యయ్యెన్ 26

కెందమ్ములం దనకుం దమ్ములని పిల్చు
మురువు సూపెడు నగుమోము దమ్మి
తావజేకు సరిరాకు తొలఁగు మనంజాలి
చాల సొంపారు లోచన యుగమ్ము
శైవాలములఁబోలఁజాలవంచుం గేరు
నెఱికప్పుఁదెగబాఱు నెఱికురులును

బిసకాండముల (గాండలసితమ్ములని దూఱి
మేలు సూపించు బాహాలతికలు
కోకములు నిత్యదోషాత్త శోకములని
పరిహాసించెడు గబ్బిగుబ్బలును గలిగి,
యెందు వెనలేని సౌందర్య మెసకమెసఁగఁ
గ్రొత్తసింగారమునఁదళుకొత్తుచుండె 27

ఆరసి చూడనప్డు జలజాకర సంపద స్వీయవస్తు సం
భారముఁబోతపోసె, ననుమానము లే, దటుకానిచో లస
ద్వారిజ ముత్పలద్వయము వారిజకుట్మలము ల్బిసంబులు
న్వారసనేత్ర కాస్య నయన స్తన బాహువులై యెసంగునే? 28

నెఱికురు ల్వక్రిమంగనె, నిడుద చన్ను
లెనసె గౌరవమున, గటిదనరె,(బ్రధిమ
సన్ననయ్యెను నెన్నడు, మన్ను మిన్న
నడక యొప్పారె మందమందంబు గాగ 29

ఆ శీతాంశునిభాస్య జ
లాశయమును వెడలి, గాంచె నసమాశుగసం
కాశుం దురగ సమేతా
భ్యాశుం గరకలిత చంద్రహాసుని నెదుటన్ 30

కాంచి, తననెంచి, నెమ్మోమువంచి, గొంత
భయము నయమును (ద్రపయు విస్మయము గదురఁ,
గాంతవంజుల మొందెడగాఁగ నున్న
నింతికిట్లనె నప్పు డాగంతుకుండు 31

ఎవ్వతె వీవు తలోదరి?
యువ్వనదేవతవో, సురమృగేక్షణవో, నీ
వివ్వనికి నేల వచ్చితి?
జవ్వని నరతరుణివైన సకియల కెడగాన్ 32

ఓ వనజాతదళేక్షణ
నీవు భయంపడఁగ వలదు, నేనుత్కల భూ
మీవిభుఁడం, బ్రియరూపుఁడు
నా విఖ్యాతుఁడను, శత్రునాశంకరుఁడన్ 33

ఇచ్ఛ మృగయా కుతూహల
మెచ్చం దిరుగాడు చిటకునేతెంచితి, నీ
యచ్ఛంపు రూపురేకల
మెచ్చితి, నీ గాథ తెలుపు మృగశాబాక్షీ! 34

అని యయ్యుత్కల భూవిభుండనఁగ, నయ్యబ్జాక్షి లజ్జాభరం
బున మోమించుక వంచి, యంచిత దృగాపూరప్రసారమ్మునన్
మనుజాధీశున కర్ఘ్య పాద్య విధుల న్మర్యాదఁగల్పించి, యిం
పున బూఁదేనియ లొల్కు పల్కులఁబ్రియమ్మంగూర్చె నీ రీతిగన్ 35

ఏనెవ్వతెనో తెలియను,
భూనాయక యివ్వనమునఁబుట్టి పెరిగితిం,
గానను నెచ్చెలి పిండువుఁ,
గాననమున నొంటిపాటుగా నుంటినిగా 36

నీదేశమ్మున నుంటిని,
నీదానను గానె, మేదినీనాయక! నీ
కేది యుచితంబుగా మది
యాదేశించిన నొనర్తు మవ్విధి నెలమిన్ 37

అనిన విని మేదినీకాంతుఁడాత్మనేమొ
కొంతతడవు విచారించి కువలయాక్షిఁ
దురగ మెక్కించి తానెక్కి త్వరితగతి న
రణ్యమార్గమ్ము దాఁటి పురమ్ముసొచ్చె 38

అతివ నంతిపురమ్మున కనిచి నర్మ
సచివు జయభద్రనాముని సకలనిగమ
రాజ్యతంత్రప్రవీణు విప్రసుతుఁబిల్చి
కాంతచరితమ్ము ఁదెల్పె నేకాంతముగను 39

ఆ వసుధామరతనయుం
డా వనజాతాక్షి చరిత మాద్యంతమ్మున్
భావంబున భావించుచు
భూవిభునకు సరసవచనముల నిట్లనియెన్ 40

నీవెఱుంగరాగ రానిదున్నె? మహీశ్వ
రా! మముంబోంట్ల పయి ననుగ్రహము కతన

బలుకుదుపుగాని, యైన నా దెలిసినంత
వట్టునెఱిఁగించెద, విను మవస్థితమతి 41

వినమే? మున్ను తపోధనాగ్రణి తపోవిధ్వంసియౌ పాకశా
సనుఁడంపన్ జనుదెంచినట్టి సురయోషారత్నము న్గాంచి కా
ననమందొంటి యిడన్ శకుంతకరుణ న్వర్ధిల్లి యేచక్రవ
ర్తినొ పెండ్లాడు శకుంతలాదుల సుచారిత్రమ్ము లుర్వీశ్వరా! 42

ఊహలు కావు గాని వినుమో యవనీశ్వర! మిమ్ము బోంట్లక
వ్యూహలు పుట్టునే? దలఁప నుత్తమ కామినులందకాక, యే
మోహినులందును న్మదివిమోహితమౌనె? మనః ప్రవృత్తి సం
దేహపదంబులైన యెడ ధీరులకు న్వెలయుంబ్రమాణమై 43

అదియును గాక యా కువలయాక్షి విలాసవిధంబు, కాంతి సం
పదయు, మొగంబు సొంపు ననవద్య మనోజ్ఞవచః ప్రకార, మిం
పొదవు గొనాలతీరు, కులుకొప్పెడు మందగతంబు దేవతా
సుదతులయందుగాక, మఱి చొప్పడునే? యివి యెట్టివారికిన్ 44

కావున మిత్రబాంధవవికాసము మీఱఁగఁబెండ్లియాడి స
ద్భావితమౌ ముహూర్తమున, ఁదామరసాయతలోచనన్ భవ
ద్దేవి నొనర్చి, యప్రతిహతింబరిపాలన సేయుమయ్య, ధా
త్రీవర! యబ్ధిమేఖల నరిందమ విక్రమణక్రమంబునన్ 45

నాతెలిసినంతఁదెలిపితి
భూతలనాయక! వివాహమునకు ముహూర్తం
బాతతమునేఁటి కేడవు
ప్రాతః కాలమున నిఁక శుభంబగు ననుచున్ 46

అని జయభద్రుం డాడిన,
జననాథుఁడు వల్లెయంచు సంతసమున మి
త్రునిఁగూడి సరససంభా
షణముల నవశిష్ట దివసషట్కము గడపెన్ 47

ఆఱవునాఁటి రాతిరి వయస్య గణంబులఁగూడి, నెమ్మనం
బూఱగ, సాంద్ర చంద్రికల యొప్పునఁబొల్పుగ, వారిపూరమున్
గాఱెడి చంద్రకాంతమణి కాంత శిలాగృహమధ్యమందు మే
ల్మీఱఁగ, ఁగొల్వుఁదీఱిచి, లలింబ్రియ గోష్ఠులఁదేలుచుండగన్ 48

సత్త్వసావర్ణ్యరాజద్రజస్తమములు
నా మొగమ్మునఁద్రిపుండ్రమ్ము వెలయ,
నంతర్నమాత్తపస్తంతు సంతతియన
నెఱి నెఱసిన కురులొమ్మెఱుఁగులీన,
నష్టసిద్ధులు తనిమాను ప్రవిష్టమ్ము
లనఁగనొప్పెడు కృశతనువుమీఱఁ,
గల్మషగ్రహము సోకఁగనీని యాంక్ష త్రా
డనఁగ జందెమ్మంస మందు ద్రేలఁ,
బటు తపఃప్రపాల స్ఫటికాక్ష మాలిక,
కక్షపాల కేలఁగ్రాలుచుండ,
నపర గాధి తనయుఁడన నొప్పు నొక్క త
పస్వివరుఁడు ద్వారభాగమెనసె 49

ఆ తాపసవరుఁగనుఁగొని,
భూతలవిభుఁడర్ఘ్యపాద్యములనిడి, చేతః
ప్రీతింగూరిచి, భక్తి
స్ఫీతాదర నమ్ర మౌళి విహితాంజలియై 50

మునివర్యుని నభ్యంతర
మునకుం గొనివచ్చి, యతిథి పూజనములఁద్ర
ప్తునిఁజేసి, యుచ్చవేత్రా
సనమిడి, సప్రశ్రయముగ జనవిభుఁడనియెన్ 51

మౌనివరా! సమిత్కుశసుమప్రతిప్రత్తి కనామయంబె? మీ
కానన భాగమందు ఫలకందము లందునె? నామధేయ స
న్మానితవర్ణ సంగతి వినం గుతుకంబెసఁగున్, భవన్నివా
సానుగతప్రభావము వనాంతరమెయ్యది? నాకుఁదెల్పవే 52

ఊరకరారు మహాత్ములు,
కారణ మెఱిఁగించి నన్నుఁగరుణింపుఁడటం
చారాజన్యవతంసుఁడు
గారవమునఁబలుక, స్మిత వికాసిముఖుండై 53

ఆ మౌనీంద్రుఁడు వల్కె నో నృపలలామా! నీకు నీవారికిన్
సేమంబే? పరిపాలనక్రమము సుస్థేమంబె? యేమైన నీ

భూమి న్మాదృశవర్తనంబులకు నేముప్పేనివాటిల్లునే?
ధీమంతుండ! వచించెద న్వినుము మద్వృత్తాంత మాద్యంతమున్ 54

సన్నుతసప్తవాచంయమ ప్రజ్మధ్య
మణిసన్ని కాశుఁడే మహిత మౌని
యవనికై పరమేష్ఠి భువనమ్మునకు నేఁగి
వేదము ల్దెచ్చెనే విపులకీర్తి
చరణప్రసాదితస్త్రైణుండు శ్రీరాము
నకు విందుఁగూర్చె నేసుకృతమూర్తి
సత్యస్వరూపాను సంధాప్రణిధాన
నిష్ఠాగరిష్ఠుఁడే నియమివర్యుఁ
డా భరద్వాజు తనయుం డహార్యసముఁడు
మన్యుఁడన నొప్పునతని యాత్మజుఁడు వెలయు
వేదనాదప్రమోదాతిమేదురుండు
గర్గమునిరాజు రెండవ భర్గుఁడనఁగ 55

అతని వంశ్యుడఁనుద్గీథుండనెడువాఁడ
నిచ్చటకు శతయోజనమెడగనున్న
కుముదవనమధ్యమందు నెక్కొన్న పంచ
వద సరస్తీరముననుందు నరవరేణ్య! 56

నేనొకనాఁడు మున్ను ధరణీ తలముంబరికింపఁగోరి, నా
నా వద నిమ్నగా నగ వనవ్రజ పుణ్యనదీ సమాగమో
ద్యానవితాన మౌని మహితాశ్రమ పట్టణతల్లజమ్ములం
బూని చరింపుచుండ, హిమభూధరరాజ శిరస్పదమ్మునన్ 57

కన్నుల పబ్బమయ్యెను, వికస్వర భాస్వరకాంచనాంబుజో
ద్భిన్న పరాగరాగరుచి దీవ్య దభంగ తరంగ, ముక్తికాం
తోన్నతరంగ మంగళ నిభోర్మి శుభాంగ, శివోత్తమాంగ వి
ద్యన్నుతసంగ, గంగ సముదంచిత భక్తజనాంతరంగమై 58

ఆకల్లోలవతీమతల్లిక తటోపాంతావనిం గాంత నా
నా కుంజాంతరలీన గుంజదలి బృందస్ఫీతమున్, సంతతా
స్తోకోద్య న్మధు మాధవీ మహిత విస్ఫూర్తి స్ఫుర త్పల్లవ
ప్రాకట్యోద్వహమంజరీనిచయ మారామంబు, రాణించెడిన్ 59

ఆ రమ్యోపవనంబును,
గౌరీవనమనఁగ నంబికా చరణోప
స్కారాత్త మహత్త్వంబౌ
ప్పారు నిరంతరము శాన్తపావనతమమై 60

అచ్చటి పుణ్యమారుతము, లచ్చటి యచ్చపుజాతి చప్పరా,
లచ్చటిగాంగనిర్ఝరము, లచ్చటి మెచ్చగు నాశ్రమవ్రజం,
బచ్చటి సద్వివిక్తతయు, నచ్చటి హెచ్చు పవిత్రతాగుణం,
బచ్చటి యందముం, దలఁప నచ్చెరువెచ్చెను నామనంబునన్ 61

అంత నప్పుణ్యవనమధ్య మందుఁగొంత
కాలమువసింప, ఁడెంద ముత్కంఠఁబెనుప
గొన్ని వత్సరముల నతి ఘోరతపము
నాచరించితి నందు ధరాధినాథ! 62

అంతట నొక్క నాఁడు కమలాప్తుఁడు కోకనదచ్ఛదప్రభా
సంతతి వీడు వేళ, సుమసాయకుసాయకమో యనన్ వనో
పాంతమునంజరించె, సకియల్ తనకూడిగము ల్జరింపుచుం
జెంత రహింప, నొక్క సరసీరుహలోచన మించు వేడుకన్ 63

ఏమని చెప్పవచ్చు ధరణీశ్వర! యాపువుఁబోడి పోడుముల్,
గాముఁడు చెంతలేని రతికామిని యాడనవచ్చు, ఁదాతగా
రేమి సృజించు, నింతి సృజియింపఁగ నోపునుగాక, యామినీ
స్వామియొ, కంతుడో, యలవసంతుడొ, ముప్పురొకంట గూడియో 64

ఆ శృంగారవతీలలామ, లుచితవ్యాపారమొప్పన్, వనా
భ్యాశమ్మందుఁజరించి, కొంత తడ వుద్యద్వారిలీలావిహా
రాశాబద్ధము నెమ్మనంబొలయ, నెయ్యంబార, మందాకినీ
వేశంతమ్ముల డిగ్గి, రొక్కమొగిఁదావింజిమ్ము నెమ్మేనులన్ 65

అందుండి వెడలి, యతివలు
మందగతమ్ముగ మదాశ్రమము సొచ్చి, కలం
డిందెవఁడో మహనీయుం,
డిందుధర సమానుఁడంచు, నెనసిన బత్తిన్ 66

సప్రశ్రయముగ, మధుర ఫ
లప్రసవప్రకరముల విలాసమెలర్పం,

గప్రఁపు టనంటి దొప్పల,
సప్రమదంబుగ నొసంగి సాగిలపడినన్ 67

అతివేలంబగు భక్తి మ్రొక్కులిడు నయ్యబ్జాక్షి కర్ణావతం
సితమందారలతాంత మంజరిక, పేర్మిన్ జాఱెనొక్కింత, మా
రుతధూతంబయి జిల్గు పయ్యెదయు సౌరు ల్మీఱు చన్దోయి సం
గతి వాసెం, గనకాద్రిఁబాయు సితమేఘస్ఫూర్తి రాజిల్లుచున్ 68

ననువొప్పంగ ఁబసిండి కొండ చఱియ న్జాల్వారు పూరంబు లా
గున, నాగబ్బిమెఱుంగు గుబ్బలజిగుల్ గుల్కొందె, ఁగ్రొమ్మించు మిం
చును మించందగి, సోకె షట్పదగుణ స్ఫూర్జ త్సుమాస్త్రాళి లీ
లను మత్పాదయుగాబ్జముం దదలకాలంకార సూనమ్ములున్ 69

అదియుఁ జాలక, తత్సమ
య దళ న్నవమాలికా స్రగంచిత తరుణీ
మృదిత స్తనకుట్మల మృగ
మదసౌరభభరిత మంధమారుత మొలసెన్ 70

పూవులవింటివాఁడు దలపోయఁగ నెంతటి దుండగీఁడొ! నా
కా వనజాక్షిఁజూపి వెడయమ్ములఁజించెనుధైర్యకంచుకం,
బే వగలేక సౌఖ్యముల నేవగమంది చరించు మమ్ము బోం
ట్లీవగలాంద్ర పొందులకు నేపఱి నెవ్వగ ఁగుందనేలకో? 71

ఉల్లముతల్లడంపడె, మనూత్కరముందలక్రిందులయ్యె, మే
నెల్ల నొగింజెమర్చె, నుదయించెను వేపథు, వక్షమాల దా
నల్లన జాఱె, గద్గదితమయ్యెను గంఠపథంబు మధ్యమం,
బెల్లను రిత్తయాయె, ఁగుసుమేషు వికారవశంవదాత్మతన్ 72

వాసవు ఁడంపెనేమొకొ తపంబునకుం జెఱుపుల్ఘటింపగా
నీసుదతీవతంసముల నిచ్చటికంచు మదిం దలంచి యుం
జేసినదానికన్నను విశేషముగా మఱిసేయ వచ్చునం
చాసుమసాయకాస్త్రముల యాఱడి కోపగలేక యంతటన్ 73

ఎట్టకేలకు ధృతిమతినెంచి, యింతి
మిన్న నాశీర్వదించితి, నన్నెలంత
లస్మదాకస్మికాగమ వ్యతికరమునఁ
దొఱఁగెనొ దోసమంచును వెఱఁగుపడిరి 74

ఏనును మనోజవికృతిం
గానఁగరానీక, కదళికాపత్త్రములం
బూనిచి, యాసనమిడి, యా
చానలకిట్లంటి వేడ్క సంధిల్లంగన్ 75

ఎవ్వరు మీర, లెందుఁజరియించెద, రిందులకేల వచ్చినా,
రెవ్వని కూఁతురీ సరసిజేక్షణ? యెయ్యది నామధేయ? మీ
జవ్వని ఁజూచినంత మది సంతసమందెడి, ఁదెల్పుఁడన్న నా
కవ్వనజాయతాక్షు, లిటులాడిరి మీటిస వీణలో యనన్ 76

ఓ ఋషి పురందరా! విను
మీ రామామణి చరిత్ర మిదియెల్లను, సాం
పారుఁబదునాల్గు తెఱఁగుల
నారయ జని కారణమ్ము లప్సరసలకున్ 77

అబ్జసంభవ భాను హిమాంశు నిగమ
మకరకేతన మేదినీ మారు తాగ్ని
సలిల సౌదామినీ సుధాసార మృత్యు
వులు ముని యరిష్టయను దక్షపుత్త్రికలును 78

గాధియనంబ్రసిద్ధుఁడు జగత్త్రయ మందునెసంగు నొక్క వి
ద్యాధరనాయకుం, డతఁడు ధర్మరతిం దటిదాత్మజాత శం
పాధరఁబెండ్లి యాడి, పరిపాలనముంబొనరించె సర్వ వి
ద్యాధరసార్వభౌముఁడనఁదద్దయు ఁగీర్తి వహించి పెంపునన్ 79

ఆతఁడు పెద్దకాలము సుతార్థము హేమమహీధరాగ్ర భూ
మీతలమందు నిందుధరుమెప్పనయం దపమాచరించె, నా
శీతమయూఖ మౌళి దయసేసి వరంబొసఁగెన్, జనించె సం
స్ఫీతగుణుండు హేతియనఁబేరును బెంపు నయం బెలర్పఁగన్ 80

ఆతని కూరిమి చెలియ లియ్యతివ రూపు
రేకమఱపించుఁదలిరాకు బాకువాని
చాన నైనను మేమెల్ల ఁబ్రాణసఖుల,
మీమె పేరొప్పెసంగు సౌదామిని యన 81

అని యనుఁగు కత్తెలన నా
నన పంకజ మోరవెట్టి ననబోఁడి తావల్

గనఁజాలు నపాంగమ్ములఁ
గనుఁగొనియెను నన్ను మేను గరుపారంగన్ 82

రాగమో మోహమో యనురంజకత్వ
శక్తియో నైజభావమో చాన యపుడు
పిల్లతెమ్మెరఁగదలు తీవెయనఁగంప
మందె నిట్లంటి నవ్వనజాక్షి కేను 83

ఇమ్ముగ నీయపాంగము సృజించెడు నమ్ములుగాక మారుపు
ష్పమ్ములు నైదుగెల్వఁగలవా కలవాణి! జగత్త్రయంబు నీ
కమ్మని జవ్వనం బడవిఁగాచిన వెన్నెల గాగ జన్మమున్
వమ్మొనరించె దేల? తగవా! మగువా! చెలులైనఁజెప్పరే 84

నీ యందమ్మునకున్ సుమ
సాయకుఁబోరిగొన్న ధైర్యశాలియు నౌరా
రా యని దల యూచు ననం,
దోయజముఖి! యింక వేఱె నుడువగ వలెనే? 85

ఇంకను దాపనేల తరుణీ! నినుఁజూపి మనోభవుండు నా
బింకమడంచి నొంచె నొకవ్రేటుగ నైదు శరమ్ములేసి, నా
కింకను దాల్మియేటి దిఁకనేటి తపం, బిఁకనేటి ప్రాణ, మీ
పొంకమెలర్చు నీదు చను మొగ్గలఁగౌఁగిలి యొగ్గ కుండినన్ 86

అని, లోనున్నది విప్పి చెప్ప నిది యేమంచుం జెలుల్ తల్లడి
ల్లి, నిజంబో పరిహాసమో దెలియఁగా లే, కొండొరుల్ మోములం
గని యబ్రమ్ము భయమ్ము సిగ్గు దొలకం గల్యాణి నీక్షించి, య
వ్వనితారత్నము నెమ్మనంబెఱిగి, దైవ స్ఫూర్తి శంకించుచున్ 87

తాపసియంచుఁడగ్గఱినఁదచ్చనలాడెడి వీఁడెవండొ యిం
దీపనిఁబూనె, నిందులకునేడ్తెఱనన్న, నదేమి పాపమో,
రూపున మీఱు మారుగొమరుంజిగి పాయమువాఁడు, జవ్వనం
బోపదె యెంతకైన? వినమో, కనమో, మునుపీదృశమ్ములన్ 88

ఇతనిఁజూచినంత నతివ నెమ్మనమున
మరుఁడు సొచ్చినట్టి మురువు దోఁచె
నేలకంప, మేల యూగగుర్పా, టేల
స్వేద, మేల యూర్పు, లీదయితకు 89

ఇది పరాధీన, యిట నిర్వహింపవలదె
మన విధిని, దైవమిందు నేమాడ్కిఁ గనునో?
యని దలఁచి, ప్రౌఢవాక్యమ్ము లాడిరిట్టు,
లతివ లెందును లొంగిన నలుసుగొనరె 90

చాలును జా లివేటి సరసమ్ములు తానఁట, మౌనియంట, యీ
బాలనుగన్న యంతమదిఁబర్వె మనోజవశంవదమ్మునై,
యేల తపంబు, లిందులకు నేనియుఁజాలనివాని, కైన మా
కేల? యిదేటిగోడు, చనునే? పరకీయల నిట్టు లాడఁగన్ 91

తల్లికిఁ దండ్రికింగనిన దానికినైన ఫలం బొకింత సం
ధిల్లగ వల్దె, మీరు పనుదెంచి కరగ్రహణంబొనర్ప రా
జిల్లును గాని, యిట్టి పని సెల్లునె? యింకను బోయివత్తు మం
చ ల్లలనావతంసములు నల్లన లేచి, నమస్కరించినన్

కాదనలేక, నేనును, మొగంబున విన్నదనమ్ముదోఁపఁ, జె
య్వేద ధృతిందలంగ, వనజేక్షణయుం బ్రణమిల్లి యాశ్రమా
రాదిలఁబాసెఁ బాయని విరాళి మదింబెనఁగంబయోరుహ
శ్రీ దయితంబు మోము నరత్రిప్పి, ననుం బరికింపు చొయ్యనన్ 93

స్నానసంధ్యలు దెలియ, వాసతియ దక్క
నితరమేదియుఁ గన్పట్ట, దిదియ గాక
పరమ వస్తు సాక్షాత్కార పరునకువలె
వైమనస్యమ్ము దోఁచె నీవాస్తవమున 94

వెడలి విద్యాధరాధీశునడుఁగనెంచి
యిచ్చునో యీయఁడో యని, యిచ్చఁదలఁకి,
తన్విఁదలఁచుచుఁదాద్రూప్య మన్వయింపఁ,
గడపితిం గొన్నిదినము, లాకాననమున 95

అంతనంతటఁబర్వె వనాంతముల వ
సంతుఁడు, లతాంతశస్త్ర సామంతవరుఁడు
బలిసె నింకొక బలుపు తద్వర్గమెల్లఁ,
బంచనారాచుఁడక్షీణబాణుఁడయ్యె 96

ఏనున్మత్తతఁ, దద్గిరి
కాననములఁదిరుగు, చొకటఁగనుగొంటిఁ, దమా

లానోకహమూలమ్మున(,
బ్రాణేశ్వరి, (బాణికలిత వదనాంబురుహన్ 97

మదమో మోహవికారమో ప్రకృతియో మాయోత్థమో శిల్పసం
పదయో భ్రాంతిజమో నిజమ్మొ కలయో మన్త్రప్రభావమ్మొ నే
త్రదురన్తమ్మొ మఱొక్కటో వనజనేత్రంగాంచి పెల్లుబ్బుచు
న్వెదుకంబోయిన తీవ గాల్ల (దవిలె న్నే(డంచు నో మెంచుచున్ 98

చేరి మనఃప్రియా! యనుచు (జీరిన నెమ్మొగ మెత్తి యింతి, గ
న్నారగజూచి, హా! యనుచు నప్పుడ ప్రాణము లుజ్జగించె, నే
కారణ మేనెఱుంగక, కకావికలై హృదయంబువర్వ(జే
కూరె విరక్తి యైహికపు(గోర్కుల (గేవల దుఃఖశేషతన్ 99

అంతట(గల్మషంబెడయ, నభ్రతరంగిణి(దానమాడి, త
త్ప్రాంతమునన్ వసించి, యశనాదికముం దృజించి, యామినీ
కాంతకలావతంసు, రతికాంతహరున్, గిరిరాజనందినీ
కాంతు, నెదందలంచి, కడకం దపమూనితి వేయి వర్షముల్ 100

అంత నొక్కనా(డు 101

అలికాంబకమువా(డు నెలవంక తలవంక
విరిపొంక మిడ బింక మొరయువా(డు
గిత్త తత్తడివా(డు గిరినోముఫలమోము
మిసిమోము తగుసాము మేనివా(డు
మినువా(కతలవా(డు నవవింటి దొరమంటి(
గొనుకంటి పెనుమంట మినుకువా(డు
చిలువసొమ్ములవా(డు తొలిపల్కు గమి చిల్కు
పసదల్కుమను కుల్కు గొసరువా(డు
చాన కనుగల్వ నునుచల్వ లీనువా(డు
కడ(గి తమమేర్పు తా(బేర్పు కన్నువా(డు
మునివరుల డెందములకందు మురువువా(డు
నెనరుదొన జాలుకొన మ్రోల నిలచినా(డు 102

ఆ చంద్రకలోత్తంసుం
జూచి. వినయ సంభ్రమములు చొప్పడ(గ సప

ర్యోచితమొనర్చి, యఘముం
ద్రోచి, ప్రణామములఁబ్రస్తుతులఁగూర్చితిటున్ 103

వారిజసంభవాదు, లనివార్యగతిన్ భవదీయ మాయ దై
వారగఁజిక్కితత్పరము పారముఁగానక, తద్గుణక్రియా
వార నిబద్ధులౌచు, నధిభౌతికరూఢి నిజం బెఱుంగ లే
రే? రజనీశమౌళి! తరమే మము బోంట్లకు నిన్నుఁగన్గొనన్ 104

మునుకొని గాలినాఁగి, మనముందనకాయతఘుంబొనర్చి, య
య్యునికిని గాంచనేమికలదో కల కన్నుల రెండు మూయ మా
సెను జగమెల్ల, నక్షములుఁజెందవు, నెమ్మనమన్న సున్న, లే
దను ననుమానమే మెఱయు నద్దియ నీవు గదా? నిరంజనా! 105

దేహముకాదు, ప్రాణములతీఱును గాదు, తలంప నింద్రియ
వ్యూహముగాదు, నెమ్మదియు బుద్ధియు గా, దిఁక నంధకారమో
మోహమొయంచు చెప్పునెదో, మున్గునెటోయది యందఖండ స
త్తాహిత చిద్రసస్ఫురణఁదళ్కును నీవిభురూపమే కదా! 106

మేయాతీతవిభూతివెల్గుచును, బేర్మిన్ శుద్ధసత్వాకృతిన్
మాయన్ సత్ప్రతిపక్ష బింబకలనామర్యాదఁదత్తద్గుణ
స్ఫాయత్స్ఫూర్తి వహించి, లీల మెయి వేసంబూని, ముల్లోకముల్
సేయం బెంపను ద్రుంపనౌదువు నతక్షేమంకరప్రక్రియా! 107

ఇల యరదంబు, ప్రామినుకులే తురగంబు లజుండు సూతుఁడ,
మ్మొలపాది సాగరంబు సురభూధరమంచితమైన విల్లు, పా
ముల యొడయండు నారి, శరము న్బురుషోత్తము, ఁడప్పురత్రయం
బెడపడు లక్ష్యమన్న సరియే? పెఱవేల్పులు నీ కధీశ్వరా! 108

దేవర్షిశుల కందరానిది భవద్దివ్య స్వరూపం, బహో!
నీవాత్సల్యము గంటి మంటి నిఁక నింతే చాలు, దుఃఖోర్మిరే
ఖావిష్టంబుల ఁదుచ్ఛ సౌఖ్యముల నే నర్థింప, ఁబ్రార్థించెదన్
గైవల్యంబు నొసంగి మన్పఁగదవే కల్యాణ సంధాయకా! 109

అని, భక్త్యున్మేషమ్మునఁ
గొనియాడెడి నన్నుఁగాంచి, కుముదాధిప భూ
షణుఁడిట్లనె, నర్థాంగం
బనుమోదింపంగ నింపులగు వచనములన్ 110

ధీరా! మెచ్చితి నీతపంబునకు, నుద్గీథా! వెతల్దీఱె, నీ
ప్రారబ్ధంబొకఁడుండె, బాధ మనుభావ్యం, బద్దియుం దీఱుచో
నారూఢంబపవర్గ సౌఖ్యము, నపాపా! రాజవంశమ్మునన్
శ్రీరంజిల్లఁగ జన్మ మందవలెఁగీర్తి స్ఫూర్తి రాజిల్లుచున్ 111

నీమదిఁదోఁచిన యది సౌ
దామిని త్వత్పత్నియగుచు, ఁదగ ధర్మరతిన్
భూమండలమేలి, తుదిన్
భూమానందమ్మ ధామముం జెనయఁగనౌ! 112

అమ్మదిరాక్షి మున్నహరహమ్మును బంబిన బత్తిమీఱ మీ
యమ్మను నెమ్మదిం గొలిచి, యర్మిలి వేఁడె వరమ్మ నీవు నా
కిమ్ముగఁగూఁతురౌచు జనియించి నను గరుణింపు మంచు, నీ
కొమ్మయునట్లకాకయని కూరిమిఁబల్కెఁబదంబమోఘమున్ 113

మౌని యొకండు దీని నియమస్థితఁగాంచియు, నెంచకౌర! యీ
మానిని కింతకావరమె, మాదృశులంగని మ్రొక్కదంచు రు
క్షోణ విలోచనాంతుఁడయి, గొబ్బున శాపమొసంగిపోయె సం
తానము గల్గకుండుమని, తావిన దింద్రియవృత్తిహీనతన్ 114

అదియునుంగాక, నిను గనినంతఁగుసుమ
సాయక వశంవదాత్మయై చనుచుఁద్రోవఁ
గాంచెనంచితు దుర్వాసు ఁగనియుఁగనదు
బాల యున్మత్తతం జాల బేల యగుచు 115

ఆ సంయమవరుఁడు, ఁద్వత్ప్రియ
నాననముంగన్న యంత నసువులెడయు మం
చూనినరుష శపియించెను,
దాని ఫలం బనుభవించెఁదద్జ్ఞుఁడవె గదా! 116

నీవొక జన్మమొనర్పం
గావలయున్ నాకుఁబ్రియసుగా, ఁదదుదంచ
త్పావన పావకకీలలఁ
బోవిడువుము దేహ, మొందు పుట్టు వెనయఁగన్ 117

అనినం దథాస్తుయని, తన
యనుమోదము సూపె నతని యరమేను, నతున్

నను(గ్రుచ్చి కవుంగిట(గొని,
కనె నంతర్థాన మిందుఖండధరుండున్ 118

నేనరుసమ్ము విస్మయము నెమ్మది(గ్రాల, హిమాద్రి(బాసి, ము
న్నూనిన భూప్రదక్షిణము పూనికనుత్తరమేగినిన్ నదీ
జానిని గాంచి, రాజతము శైలము నెంచి విభుందలంచి, జాం
బూనదకాద్రి(జుట్టి, బహుపుణ్యము భారతవర్ష మొందితిన్ 119

ఒకచో(గుముదుండను ముని
ప్రకటంబుగ దశసహస్రవత్సరములు కొం
కక తపమొనర్చి, యెనసెం
బ్రకృష్టకైవల్యపద మపాకృత తము(డై 120

అదియ కుముదవనమ్మన నధికమహిమ
వఱలు, నందును(దత్త్వభావమ్ముకతన(
బంచనదములు(బ్రవహించు నంచితముగ,
నచటి సరసున నద్ది యయ్యాఖ్య(దనరు 121

సన్నుతమగు నవ్వనమున
జన్నంబొనరింప(దల(చి జగతీశ్వర! యే
నన్నెలవున నివసించితి
మొన్నటి కైదవదినమ్ము మొనకొని యధిపా! 122

ఆ వనవాసులైన మహితాత్ములు దెల్పిరి, ముద్గరాసురుం
డావని సంచరించు, నియమాహతులం బొనరించు, నధ్వరం
బే విధిజేయ నిచ్చు? నమరేశునకే(జెనకంగరాదు గౌ
రీవిభు మెప్పు(గాంచె, నెదురే(గెదరే యి(క నెంతవారలున్ ? 123

ఈవిలకెల్లనొక్క(డ వధీశు(డ, వప్రతిమాస్త్ర శస్త్ర వి
ద్యావిధివేత్త వంచును రయంబున నీకడ కేగుదెంచితిం,
గావున నీవు జన్నమును గాచెదనంచును బాస సేసినన్,
భూవర!యధ్వరాంగ చయముం గొని యుంచెద, నీకు మేలగున్ 124

అచటి వారలెల్ల నద్భుతమంద, ని
వ్వడిని బలికి మౌనివరు( డుడిగిన,
వినయ నమ్రము(డౌచు వెడనవ్వు దోపఁగ
నిట్టు లనియె మేదినీశ్వరుండు 125

భానుకులంబునం బొడమి, బాపనిజన్నముఁగావలేని భూ
జాని యితండటం చపయశంబొనగూర్చకు మయ్య!, యింక నీ
యాన వంచిచెదన్ విను, మహాసురునిం బరిమార్చి యాగ ర
క్షా నియతిం జరించెదను, సందియమేల మునీంద్ర చంద్రమా! 126

అనిన మునివర్యుఁడిట్లను నరుసమెనసి,
నేఁటికింకనుఁబదియవనాఁట మొదలు
జన్నమునకప్పటికి సైన్య సహితుఁడవయి
రావలయు నీవు విశ్వంభరావిభుండ! 127

అనిన సంతసపడు రాజుఁగని, మఱొండు
రాజు వెల్వెలవాఱె స్వతేజ మాఱ,
నుదయగిరికెక్కెఁ దనవాని యొప్పుఁగాంచ
దినకరుఁడనంత వసుసమృద్ధినిఁబొసంగి 128

తావిపన్నీటఁదోఁగి నెత్తమ్మి దువ్వ
నలఁది, ఘనసారఘనసార కలన నగరు
ధూపముల నొప్పి, దివ్యాంబరోప క్లప్తిఁ
దనరె నంతఃపురికయనఁదత్పుర రమ 129

అంతఁబురోహిత హిత సా
మంత సచివు లమరి కొల్వ, మానవపతి దా
సంతసమున వనసంగతఁ
గాంతామణిఁబెండ్లి యాడె గాంధర్వమునన్ 130

ఆ దంపతులకునాశీ
ర్వాదం బొనరించి, తదభివందితుఁడై, భూ
మీదేవోత్తముఁడరిగె, ధ
రాదేవ విభుండు మివుల రాణ దలిర్పన్ 131

సచివులు రాజ్యతంత్రము విసంకటవృత్తి వహింప సంతసిం
పుచు నచిరోఢఁగూడి, తలఁపుల్ వలపుల్ బలుపొంద, ఁదన్నఖం
పచ కుచ మర్దనోచిత విమర్దములం దదుపాంత భంగికా
రచనలఁదేలె, డెందమలరన్ నవవాసరముల్ సుఖోన్నతిన్ 132

అథతం బదియవనాఁట, న
నంతా కాంతుండు మౌని నాథాధ్వర వి

ఘ్నాంతకృతి సముద్యుక్త
స్వాంతతనుండెం బ్రయాణ సన్నాహమునన్ 133

అరుసముఁగూర్చు సొమ్ము గడు నందము గందముఁజిల్కినట్టు, లీ
చెరువు నిజంబు పేరుగల చిన్న కయిూసరుఁడిట్లొనర్చు చా
ల రవణ సుందరేశ్వర విలాసము నాఁదగుఁదెల్గు కబ్బమం
దరిగెను గెంపు దొల్తటిది తద్దయు (బెద్దలుఁబెద్దసేయఁగన్ 134



# ద్వితీయాశ్వాసము

అటులు పయనమ్మునకు సిద్ధుఁడైన తేని
దెసకు నెఱుకులతేఁడేఁగుఁదెంచి, మేలి
ముత్తెపుసరులు, చాఱపప్పులును, జున్ను,
సంకుమదములు, సెలవిండ్లొసంగి, మ్రొక్కి 1

మ్రొక్కిన బోయనిఁగన్గొని,
యక్కుతలాధీశుఁడేమి యక్కఱ యని తా
నెక్కొను మాలిమి నడిగిన,
నిక్కరణింబల్కె వినయమెసఁగఁగ నతఁడున్ 2

ఓ మహారాజ! కుముద వనోపకంఠ
కాననమ్ముల, శ్వాపద గణన శూన్య
దరుల, దంతావలోద్దండ దంతఘటిత
వేశ్మముల, నివసింతుమేబీతు లేక 3

భూరి గజేంద్రకుంభతటముల్ పఱియ ల్వొనరించి ముత్తెముల్
పేరులుబూన్చి, దుర్విషహభీమ భుజంగమ మూర్థ రత్నము
ల్వారు బొసంగఁగా నెడనెడ న్నటియించి, ఘటింతుమింపుగా
శూరవరేణ్య! ద్వారముల, సోరణగండ్లను, దోరణమ్ములన్ 4

పెనుసివంగులు, మదకరుల్, బెబ్బులును,
గుపిత మృగయూథములు, పటు కోలతతులు,
కాఱెనుంగుల గము, లుగ్రగండకములు
భూమినాయక! మాకు క్రీడామృగములు 5

ప్రల్లద మాడుచుంటి మనరాదు మహీశ్వర!, పల్లెలోని మా
పిల్లఁడొకండు వోయి, యతిభీకరలీల మృగారికోటు వా
టిల్లఁగఁజూలుఁద్రెంపుచుఁగడింది మగంటిమిఁబోరి, వేడ్క సం
ధిల్లఁగఁదన్ముఖంబున గణించును వ్రేలిడి వాఁడికోఱలన్ 6

బానం గుంపటి పైనిడి,
మా నెలఁతలు కూరలేమి మదిఁదలఁచి, వెసం
గోనలకునేఁగి తెత్తురు
మానుగ నేకలముఁబొడిచి మనుజాధీశా! 7

ఒక్కపఱి మీరువచ్చి, మాయిక్కలెల్ల
మెట్టి, మేమిచ్చు గాన్కల ముట్టి, కాన
లెల్లఁగన్గొని, వేడ్కసంధిల్లనేని
వేటలాడఁగవలయు, మామాట వినుఁడు 8

అమ్మహితాటవీస్థలి ననన్యసహంబులు మత్తహస్తి యూ
ధమ్ములు నేలఁబాఱు జలదంబుల డంబున నొప్పుమీఱి, తొం
డమ్మునఁబెట్టి మట్టులిడు నాకగజేంద్రము, నేకదంతుఁ బం
తమ్మునఁగేలిసేయును, విదల్చు నదల్చును దిగ్ద్విపమ్ములన్ 9

అతిరావము లచ్చటి మృగ
పతులు, సతతనిహత దానవద్విపవరసం
తతులు, పరిహసించును సం
హృతైక దానవుని నరమృగేంద్రునిఁగడఁకన్ 10

బహుల వర్ణస్ఫుర చ్చతుష్పాది యమరఁ,
బ్రాసములఁగుంటు వడ, కుద్రవత నినాశ్వ
ముల నిలిపి, తద్వనగ్రంథముల నెసంగుఁ
దనరి, శార్దూలవిక్రీడితమ్ము లెందు 11

వనతలమందు నెందును నవక్రగతిం జరియించి మించు, నె
ట్టనభ్రమియించు చీఁకటిపటాలములోయననొప్పి, భీకర
ధ్వని నెకతాళిసేయు వనితా నిహతు న్మహిషాసురేశ్వరున్
వనమహిషవ్రజంబు లపవారితశుండ మతంగజోన్నతిన్ 12

అన్నీరేజభవాండ
మ్మున్నెఱియలువిచ్చ, ఁబరుసముగ నఱచుచు, మా
పన్నిన వలఁదన్ని చనుం,
బన్నిన రోషమున నట సివంగులు నధిపా! 13

దారగణమ్ము దమ్ముల సదారకమై వెనుగూడ, ఁబోత్రభూ
దారణవృత్తిమీఱి, యతిదారుణలీలఁజరింపు, చాది భూ
దారములెక్కసేయవుగదా రదధారల నవ్వనాంత భూ
దారచయమ్ము లెందు సముదారగతిన్, క్షితిదారరత్నమా! 14

ఉచ్చలఁజొచ్చియు, నెచ్చిన
మచ్చరమునఁద్రెంపిపేర్చి, మనుజేశ్వర! పె

ద్రుమ్మచ్చులు వాలు మెకంబులు -
విచ్చలవిడిఁ దిరుగు, గహనవీధుల నెపుడున్ 15

భీకరవృత్తి జొంపములఁ బెల్లుగరోజుచు, నేదిగన్న, నే
యాకుపుటుక్కుమన్న దురహంకృతి ఘూంకృతిసేయుచు, న్మహా
సూకరలీల ఁగానఁగలఁచుం గలగుండువడంగ, నుగ్రభ
ల్లూకము లెందుఁజూచినను డొల్లును భూతల మీనుచాడ్పునన్ 16

క్రొవ్వుపొగరున నోరగఁగొమ్ములిడుచుఁ
జెవులు రిక్కించి, మమ్ములఁజెంతఁగనియు,
నదురు బెదురందవాహరిణ వ్రజములు
దక్షిణేర్మములయ్యును దలఁగవధిప 17

కొమ్ముప్రంగలు పొదలఁజిక్కుకొన నిట్టి
పోతులం బిడిబాకుతోఁబొడవవచ్చు,
నొక్కవడి నల్దెసం బర్వి డెక్కవచ్చు
జాగిలంబులఁబనిలేదు, జనవిభుండ! 18

గడ్డిపిట్టయు గున్నంగి గావగలుకు
గువ్వ పోపిట్ట పొన్నంగి రివ్వ బెళవ
వరకవాజమ్మ వాలజిట్ట వగకొఁజు
పక్కులింకను లెక్కకు మిక్కుటములు 19

అని యెఱుకఱేఁడు వల్కినఁ,
బెనుఁగొను మృగయాకుతుకము, పెలుచ మహీశుం
డనుచరులకు నాదేశిం
చెను దదుచిత వేషమెనసి సిద్ధముకాఁగన్ 20

ఆటవికవ్రజమ్ము తనయగ్రమునం బచరింప లేచి, యా
ఖేటక వేషమూని, పిడిగీలముఁగేలవహించి, వేగవ
ద్ఘోటకమెక్కి, సైన్యములు గొల్చుచు రాన్ మునిజన్నమోమఁగా,
వేటకు మూగఁగా, మనము వేడ్కఁబొసంగ ఁజనెం దురమ్ముగన్ 21

కాంచె న్నారభదర్శనోద్భ్రమచరత్కంఠీరవాటీక నో
దంచ త్కుంజర దంత భగ్నవిటపి ధ్వన్యుగ్ర శార్దూల గ
త్యంచ త్సంశయ వృద్ధభల్లుక విరావాపాస్త నిద్రర్శ్య భీ
సంచారోద్భట కోక కాసర విలాసమ్ము న్మహారణ్యమున్ 22

అందున్వొచ్చె నృపాలమౌళి, తనవారందందఁ గ్రొంగ్రొత్తలౌ
పొందు ల్బొసఁగ నుబ్బి సైన్యకలనా ప్రోత్కంఠ భిల్లీమృగీ
సందోహమ్ముల సుందరమ్మువు దృశాసాదృశ్యముల్ చిత్తమా
నందాయత్తమొనర్పఁగన్గొనుచు, వన్యారేఖిక ల్మెట్టుచున్ 23

కొమ్ములు కావిపంచెలును, గోఱజపూఁతలు పల్లజుంజురుల్,
జిమ్మనఁగ్రోవులుం, దలలఁజీరములు, న్నెలవిండ్లు దంతపున్
సొమ్ములు గింజపేరులును సూరియ, లీటెలు, నొప్పుమీఱఁగా,
నిమ్ముల తేనెఁగాంచి, శబరేశ్వరులెల్లరు మ్రొక్కిరొక్కటన్ 24

రెంబలు వేయువేడ్క, శబరీ కబరీ నిబిరీస మంజు కా
దంబకమంజరీ మృగమదప్రియ సౌరభ లోభ లోల రో
లంబ పతత్త్రమిత్ర విచల న్మసృణాలకకాన్తి హృన్నిరా
డంబర తద్దృశాప్రభల డంబులు, మెచ్చె నృపాలుఁడయ్యెడన్ 25

దారుణపింగళాక్షుల నదభ్రగతిన్ మిటిమిట్టి సూచుచున్,
భౌరుతులన్ దెసల్గొనఁ గఁబద్మభవాండ కటాహమెల్ల నీ
సారెకుఁజాలదంచు జవసత్త్వముఁదెల్పెడి జాగిలమ్ముల,
న్నొరుగ జాళువాసరిపెణమ్ములఁదెచ్చిరి రాజపుత్త్రకుల్ 26

పూని, వెడ వెన్నుపక్కకు బొక్కవెట్టి,
భవునిసొమ్ముల ముట్టి, యబ్జజ కుమార
విఘ్నపతి వాహముల మట్టు వెట్టఁజాలు
సాళువమ్ములఁదెచ్చిరి శబరులంత 27

బంటొకం డుగ్రమృగనాథు దంట కేగి,
పంబిన కడంకఁబెంజూలు వట్టి తివిచి,
తత్కరాగ్రపంజరమునఁ దవిలియు నసి
స్రుక్కనేసెను జనపతి వెక్కసఁపడ 28

బోయండొక్కడు నిక్కి, చీఁకటిపొదన్ ముట్టాడు శార్దూలమున్
డాయంబోయి మగంటిమింజెనకి నంతన్, ఘోరనిస్వాన మా
లోయందోఁచెను రిచ్చవోయెను నృపాలుం, డంతలో నాతఁడుం
గోయంచార్చుచు నేఁగుదెంచె నహతాంగుండై భటు ల్మెచ్చఁగన్ 29

ఈటెంగైకొని పోటొకండు తటిమెన్ ద్వీపిన్, విజృంభించి నె
ప్పాటంబైఁబడ నడ్డు లొడ్డి విసరంబ్రాసంబును న్వాసిలో

పాటుందప్పిన, వీఁకమైపెనఁగుచుం బంతమ్మున న్వచ్చె బ
ల్గాటంబైన యురంబు గోళ్ల, నవనీకాంతుండుఁ దన్మెచ్చఁగన్ 30

వనమహిషవ్రజమ్ముఁగని, వారని వేడ్కనొకండు వాలుఁగై
కొని తునియ ల్బొనర్చె శితకోటి, ఁబెరిల్లుపెరిల్లు మంచుశృం
గ నిచయమెల్ల డుల్లెను, దెగంబడెఁబ్రేవుల మూఁక, రక్త వా
హిని దొనకట్టి పాఱెను మహీపతి యబ్బురమంది చూడఁగన్ 31

సరభసమ్ముగఁబఱతెంచు సైరిభమ్ము
వంకికోలఁబొడిచి లాగె బంటొకండు,
ఆంత్రగణములు వెలికిరానదియుఁగూలె
వజ్రహత పక్ష భూధరవరము కరణి 32

ఆఱని మచ్చరమ్మున, దిగంత మతంగజ కర్ణగోళముల్
మాఱుచెలంగ నార్చుచు, సమగ్రరుషోగ్ర కృతాన్తవాహమున్
మాఱుమొగమ్మువెట్ట, ఁబలుమాఱు తల న్విదిలింపుచున్, వడిం
గాఱెనుబోతు పర్విలిడె, ఁగాననమెల్ల ఁగలంగ నత్తఱిన్ 33

వ్యాధవరులేయు నీటెలపాటు దప్పి,
సైనిక నికాయ మమ్ముల సరకు గొనక,
ఱంకె లేయుచు నాఁటేని వంక కుఱికె
వారువమ్మును జంకి వెన్పాటు వడఁగ 34

అంత నధిజ్యశరాసుఁడ
నంతాకాంతుండు తీగ నారసమున శృం
గాంతరము గాడనేయ, నొ
కింత న్మొగ్గతిలి పాఱె నెక్కటి భీతిన్ 35

మడిగి శైవాలచయము రోమములఁదవిలి
జాఱ, శాలూకములు కోఱపంది నిఱుక
నెసఁగు ఘుర్ఘుర రవముల, దెస లద్రువగ,
నేఁగుదెంచెను క్రొవ్విన యేకలములు 36

చయ్యనఁగొందఱానృపతి సంతసిలంబురికొల్పి, పట్టెదల్
దుయ్య, ధనుస్స్ఫురచ్ఛరములోయన మించువడిన్, దిశాంతముల్
వ్రయ్యఁగ, భైరవంబులు గరం బెసఁగం బెనుజాగిలంబు ల
డ్డయ్యెను, వాఁడికోఱలఁదదంగములం బలునాటఁబీకుచున్ 37

ఒక్కమొగి, (బందులైదాఱు, నుక్కుమీఱఁ
బైఁగవియ, (గుపితంబగు జాగిలంబు
చిత్ర చంక్రమణమ్ముల చెలువుదోప,
డొక్కలంజీల్చి, యన్నింటి యుక్కడంచె 38

ఏకలమొండు ముందుసనియెం దనమందను వీడి, దాని వె
న్డాకెను జాగిలం, బదియుదాగెను భల్లుకమున్న లోయఁదో
దూకెను కుక్కయుం, దొడరి తోడ్పడె రెండును నిండు వీఁకమైఁ
బీకెను రక్కెనుక్కెడల (బ్రేవులుఁద్రెంపెను రెంటి నొంటిమై 39

ఎదురు వఱతెంచు నాగుంపు నదనుసూచి
వ్యాధుఁడొక్కఁడు కౌశల మగ్గలింప,
(మ్రొగ్గతిలి, పాఱయమ్మునఁబూని యేసె!
గౌఱిజలెల్లనుఁదెగి నేల పఱపుగాఁగ 40

ఎందులనుండియో వనమహీతలమెల్లను దద్దరిల్ల (బె
న్పంది యొకండు ఘుర్ఘుర రవంబులరోజుచు నేఁగుదెంచి, యే
పందిన బల్మి సైనికశరాహతులన్ క్షతినొంద, కాన్పపా
లేందుని డాసి పైకుఱికె నిందుని డాయు విధుంతుదుండనన్ 41

నరవిభుఁడుఁగొట్టె బల్దీగ నారసమున
మరుతర శిరస్తటము నందు నుచ్చిపాఱ
మొకరిల్లియు నంతటఁబోఁకయుఱక
బోత్రిఁదెగవ్రేసెఁగరవాలమునఁగసిమెయి 42

ముక్కుల నోటను నెత్తురు
గ్రక్కుచు, నెగరోజి సూకరము వనభూముల్
గ్రక్కదలం బాఱెను, వెను
చక్కిన్ మానవవిభుండు శరములు గురియన్ 43

ఖడ్గమృగమొండు భీకరాకారమొప్పఁ
బఱవ, నొకజోదు మునికోల వైచె, నదియు
నేచి పైఁబడెఁద్రొక్కిన (త్రాఁచనంగ,
నుడుగ కాకోలఁగుత్తుకఁబొడిచి యడఁచె 44

చలము మీఱంగ నిట్లతి సాహసమున
మృగయ నాయుధపాండితి మిగుల శబర

భటులకెల్ల సముత్సాహబలము లెసఁగ
బహుళ బహుమానముల నిడెఁ బార్థివుండు 45

కొందఱు భిల్లులు భూవరుఁ
డెందమునకు వేడ్కపొసఁగ దేగల నుసిగొ
ల్పం, దార్క్ష్యతమ్ములనఁబా
ఱెందరణిప్రభల మెఱుఁగుఱెక్కల వెలయన్ 46

సాళువమొండుపైకెగసి, సత్రున మేఘగణమ్ములెల్ల, న
ల్లాడగఁబోయి పోయి, వియదధ్వ నదీతట కల్పశాఖికా
నీడచరమ్ము హంసమును నిష్ఠుర వృత్తిని బట్టితెచ్చె, భూ
పాలవరుండు గాంచి, విధివాహనమో యని పిచ్చలింపఁగన్ 47

ఉందురులఁజుచుందరులను
గుందేళ్ల న్నకులములను గొక్కుల నెల్లన్
సందిటనిడి పొడుచుచు వన
మందుం జరియించె నణుజు లధిపుఁడు సూడన్ 48

అంతరౌరవరాంక వన్యాంకవములు
కార్ష్ణసారము లైణము ల్గావయములు
చామరములు రౌహిషములు శాంబరములు
గంతులిడుచునుఁబాఱె నాకాననమున 49

కొమ్ములసెలిగియు, ఁబలువా
లమ్ములవాలముల నతికి, యన్నింటి నిమే
షమ్మున వధియించిరి భష
కమ్ములు శబరులును సైనికనికాయమ్ముల్ 50

ఆవర్ధిష్ణు యశోవిభాసి మృగయావ్యాపార మొప్పంగ నీ
తేవం గొంతవడిం జరించి, భటకోటిం ద్రిప్పి పంపెం దదా
రావంబాశ్రమవాసి సంయమ పరిభ్రంశమ్ము గావించునే
మో వల్దంచు, నవక్రవిక్రమభుజాస్ఫూర్తి న్నమర్దింపఁగన్ 51

శబరవర్యులు మేలిమాంసమ్ములెల్ల
సంచులంగుట్టి కావిళ్ల సర్దియిడఁగ
మధురఫలకందముల మెక్కి మఱలి చనియె
వీటి కవ్వీర సైనిక ఝూటమపుడు 52

భిల్లవరులేఁచు పిడకనెగళ్లచుట్టుఁ
గూడి చెడు గట్టలం జమురోడఁగాల్చి
దయ్యములకిడి శిష్టంబు తమకుఁబంచి
నంజుడు ల్మెక్కి రాష్ట్రముల్ నంజుకొనుచు 53

ఆ రాజు సముచితహితా
హారమ్ములఁద్రుప్తినంది హారిపరిమళో
ద్గారి శిశిరోదకముఁగడు
పారంగొని గ్రోలనిచ్చె వారువమునకున్ 54

అతఁడె మారుతాశ్వకమలాక్ష తురంగ మనంబులెల్లఁజే
చేత జయించువేగమున ఁజెల్వురహించి, కురంగకమ్మనం
తాతలనాథులోచన పథంబెనసెన్, ధనువంటి నంత, వ
బ్జాతభవాండ మెల్ల నొకసారికి ఁజాల దనంగ గంతిడెన్ 55

రాజవరేణ్యుఁడున్ వెస ఁదురంగమమెక్కి యదల్చినంత నా
తేజియు సప్తవార్ధి పరతీరముఁజూడఁగఁజాలు వేగముం
దేజము మీఱవెన్బడ, వదీనత నద్దియు నోదె చాటుకున్
భూజగణమ్ము మాటునకుఁబోవుచు డాఁగుచు నిక్కి చూచుచున్ 56

పర్విన నుర్వీకాంతుఁడ
ఖర్వమ్మగు చలము మీఱఁగా, నామ లస
ద్దుర్వర్ణపుంఖ కలితము
దుర్వారగతమ్ము శరము, దొనకొని యేసెన్ 57

ఏయ నాయిఱ్ఱిపో తుత్తరేర్మమయ్యు
నధిక జవమునఁబఱచె, నయ్యధిపవరుఁడు
మివుల నుత్సాహమునఁదరిమెను వనముల
నయనపథమును దప్పి చనంగనీక 58

రాజవతంస! యాశ్రమచరమ్ము మృగమ్మిది, దీని జంపనౌ
నా? జననాథ! యన్న ముని నాథుల యెల్గు చెవింబడన్ మహా
తేజుఁడు తేజి డిగ్గి, కనె దివ్యము నాశ్రమముం దపస్స్ఫుర
త్తేజుల మౌనులన్, వెస నతిన్ సలిపెన్, వినుతించి యిట్లనెన్ 59

మాన్యులార! నన్ను మన్నింపుఁడిది యిది
యనుచు నెఱుఁగనైతి, నమ్ము దగిలి

గాయమయ్యె నిచటఁగాంచరొక్కొ, భవత్కృ
పా రసమ్ము గాచెఁబ్రాణములను 60

అనిన నొక్క మౌని యల్లన నవ్వుచు
నమ్ము పీకి చేత నామృశించి
యేది గాయమిచట లేదే యనం, గాంచి
రాజు విస్మితాంతరంగుఁడయ్యె 61

ప్రియరూప మహారాజా!
ప్రియమొదవెను నిన్నుఁజూడ, వెస రావలె, నీ
కయి వేచుచుండె నధ్వర
నియతుం డుద్దీధమౌని, నృపవంశమణీ! 62

అను తచ్ఛాత్రుల విని, చని
మనుజాధిపుఁడధ్వర నియమస్థితు నుద్దీ
ధుని మునిసంక్రందనుఁగనె,
వినతిం గావించె భక్తి వివశుండగుచున్ 63

మానవనాయకా! కుశలమా? సమయమ్మున కేఁగుదెంచి తీ
వే నిఁక ధన్యుఁడన్, గ్రతువహీనతఁజెల్లు దినత్రయమ్ము నీ
వే నెఱినప్రమత్తత వహింపు శుచివ్రత! దానవౌఘము
ల్పాని చరించు, నెయ్యెడల లోపము దోఁచునటంచు రేఁబవల్ 64

అనిన, నట్లకాకయని, తన్నియుక్తుఁడై
పర్ణశాల నెనసి పార్థివుండు
నెలమి మునికుమారకలితోపచారుఁడే
మఱక, రక్షణాప్రమత్తుఁడయ్యె 65

మౌనిబాలుర క్రీడాభిమర్శములను,
వత్సవత్సలగోమృగీవర్గములను,
దరు లతా గుల్మసంపత్తిఁదవిలి కనుచు,
జన్నముంగాచె మాఱు దాశరథి యనఁగ 66

అంతటిలోనవచ్చె సముదగ్రతరారవముల్ సెలంగ, దు
ర్దాంతము రాక్షసౌఘము దురంబు దురంగము నెక్కి, మేదినీ
కాంతుడు నిల్వునిల్వుఁడని కార్ముకమంది, నిమేషమాత్రలో
నంతకువీటికింబనిచె, నందఱనొక్కట నస్త్రపాండితిన్ 67

ముద్గర నిర్జరవైరి స
ముద్గత జలదప్రకారమున (గన్పడి, ర
క్తోద్గారమ్మొనరించె ద్యు
సద్గణమును మౌనివరులు సంభ్రమమందన్ 68

పవమానాస్త్ర మమోఘపాతము మదిన్ భావించి సంధించె రెం
డవ రామప్రభు(డో యనం, బఱచె నంతన్ దివ్యతేజోమహో
జవ తద్బాణబలంబునన్ దనుజు(డోజంబాఱ (బాఱెం, దిగం
త వసద్దంతుల కంటిమేఱలకు నందన్నాక భీకంప్రు(డై 69

అనెఱి నిరన్తరాయము
మౌనివరాధ్వరము ముగిసె, మనుజాధిపు(డ
క్షీణపరాక్రము(డు ధను
ర్బాణకరుండౌచు యజ్ఞరక్షకత(గొనన్ 70

ఉద్గీథ మౌనివరు(డు స
ముద్గచ్ఛన్మోదవారిపూర్ణుండగుచున్
గద్గదవచనమ్ముల భూ
భృద్గణమణి కిట్టులనియె(బ్రియ మెసలారన్ 71

ఏమని యెంచెద న్నిను, మహీన! యహీనశయాన! నీకు లె
క్కా మముబోంట్ల జన్మముల(గాచుట, లోకములెల్ల నోచు బ
న్నోములు నీవ, తత్ఫలములు న్భవదీయ పదాబ్జ షన్నిధి
స్థేమమె, కర్తవుం గ్రియవు దేయము దాతవు నీవెగా విభూ! 72

మాయంద్రోయకు నన్ను మావిభు(డ! నీమర్మమ్ము దెల్పెన్ విశన్
మాయాతీత విభుప్రభావము రహింప న్వెల్గుచున్, లోక ర
క్షాయత్తత్వమున న్విచక్షణ దురూహ్యాకారముంబూని, నీ
సేయంబూనిన కజ్జము ల్తుది(గనం జేకొందువా కందువన్ 73

అనిన నౌకింతసేపు వినయమ్మననో, వచనప్రభావమో,
మనసునకేమిదో(చెనొకొ, మాయయొ మంత్రమొ ధ్యానయోగమో
కనులు మొగిడ్చె భూవిభు(డు, కారణకార్య పథాతిరిక్త ని
ర్గుణ నిజరూపబోధమునకుం గనెనో దగ నున్మనస్థితిన్ 74

మౌనివతంసు(డిట్లనె నమస్కృతి(జేయుచు, నింతలోనె యం
తా నలినాక్ష! యైనని(క(దద్వచనంబులు చాలు వేయునే

లా? నను ధన్యుఁజేసితివిగా సవనంబవనంబొనర్చి, కా
దేనియు నిన్ను గంటి నదియే పదివేలు పురాణపూరుషా! 75

వ్యావహారికమ్ము వర్తిల్లునంతకు
వలయు నీ భవాస్తి భావ భాన,
మింకఁబ్రకృతిరూపమెనయుము ప్రియరూప!
భూతలేంద్ర! యసము ముదము గొనుము 76

అన, నగుచుఁగాంచె మునివర్యు నాననమ్ము,
నందు భావమ్ము తమరికెయచ్చుపడఁగ
భూమివిభునకు నమ్ముని పుంగవుండు
మఱల నిట్లనె, మధుర సంభాషణముల 77

సెలవొసఁగుము నాకిఁక, నీ
జ్వలనమ్మున మేనువాసి శర్వునియానన్
సలుపగ నని, వలదన్నను
వలగొని చనునంతలో, నభంబిల యద్రువన్ 78

అరుదెంచె న్రణవీరదానవసహస్రాక్షౌహిణుల్ గూడి, ము
ద్గరదైతేయుఁడు యజ్ఞశాలపయి బంతంబొప్ప, నైకాస్త్రముల్
గురియం దద్భుట కోటి మౌనివరసంక్షోభంబు గావింపఁబో
వ, రయం బొప్పఁదురంగమెక్కిఁజగతీపాలుండు సేష్వాసుఁడై. 79

వినువీధి న్నిర్జరముని
గణము లధిక విస్మయమున గన్గొనఁగా, ఁబం
బిన రుష నిశితాస్త్రచయ
మ్మునఁదుత్తునియలు బొనర్చెఁబూర్వామరులన్ 80

జలదగణము మహాప్రభంజన హతమయి
యడఁగు నోజను, రాజమార్తాండ సాయ
క కిరణమ్ము లల దైత్యాంధకారపటలి
విచ్చె భయమెచ్చ వ్రచ్చెను నొచ్చెఁజచ్చె 81

సామర్షుండయి రాక్షసాధిపుఁడు ప్రాసంబేయ, మధ్యంబునన్
భూమీశుం డది ద్రుంచి పంచవిశిఖమ్మున్ గ్రుచ్చె వక్షంబునన్,
భీమారావమెసంగ మూర్ఛ నవనింద్రెళ్ళెం, బవిచ్చిన్నమౌ
భూమీజం బన నప్డె లేచె వడి సుప్తుం డుత్థితుండౌక్రియన్ 82

లేచి, యంతటఁబోక యేచి, గాఢాంధకా
రమ్మయి, భాస్కరాస్త్రమున విచ్చె
విచ్చి, యంతటఁబోక హెచ్చి, కార్చిచ్చుగా
రూపంది, పర్జన్యరూఢి నాఱె
నాఱి, యంతటఁబోక మీఱి, శిలాతోయ
దమ్మయి, పవనాయుధమునఁబాసెఁ
బాసి, యంతటఁబోక జేసి, సంవర్తాశు
గమ్మయి, యురగాశుగమున నడఁగె
నడిగి, యంతటనుంబోక, కడఁగి సోమ
కాది దానవవీరుల యాకృతిఁగొని,
తత్ప్రతిశిలీముఖ క్షతి ధ్వస్తుఁడయ్యు
రూపు మాయఁడు ముద్గరుఁడేపుసూపి 83

సురమౌనుల్ వెఱగందిసూడ, వివృతాస్యుండై తురంగమ్మ, ఁద
త్తురగారూఢుని మ్రింగ రా, విభుఁడు దోఁర్దో సాయకౌఘమ్మున
న్సురవైరిందనువెల్ల జిల్లులువడ న్నొప్పించి, వాలమ్ము ని
ష్ఠురతత్ఫాలము గాడనేసె, రుధిరస్రోతం బుదాత్తంబుగన్ 84

తాళగ లేక ప్రాణములు దక్కినఁజాలు నటంచు, వాఁడు భీ
లోలతఁబాఱె నయ్యధిపుఁడున్వెనుదాఁకెను వెన్ను నమ్మలన్
గాడఁగనేయుచున్, ఖలుఁడు కానన వర్గము దాఁటి, యొక్కచో
శైలగుహాంతరాళమునఁజయ్యనసొచ్చి, యదృశ్యుఁడై చనెన్ 85

దానవనాథు నెమకుచు ర
సానాయకుఁడందుసొచ్చి, చని చని, యుదయ
ద్భాను మరీచి సరోచి ర
నూన కిసాలమ్ము మేలి యుపవనముఁగనెన్ 86

హారియశుం డదృష్టచర, మశ్రుత పూర్వము, ఁదద్వనమ్ము సొం
పారయ సొచ్చె, నస్త్రనిలయం బెనయం జను మారునోజ, మం
దార మరందబిందుజనితశ్రమ మారుతశీలితాగ్ర, మా
సౌరవనాంత మీసొగసు చాయకుఁజాలదటంచు మెచ్చుచున్ 87

సుమితమహీజపాళి, సొగసుందనమీనెడి తేనె సోనలున్,
భ్రమరసమూహసంనదదుపాన్తములౌ నవపొన్నులు, న్మనో

రమ కమలానుషంగ విసరత్పవనాంకురము, ల్తగన్ వనీ
రమ కొమరొప్పె, డెందమలర న్మరియాదలొనర్చు చాడ్పునన్ 88

లలితపల్లవ ఫలముల మెక్కి, యతి దర్పి
తలయి, పికశుకాంగనలు వొసంగెఁ
గాకలీ మనోజ్ఞ కలకంఠరవముల
నవని పాలుఁగుశల మరయు రీతి 89

అనితరసౌరభంబుల, ననంతరసోద్గమజాలకంబులం
గనదురుపల్లవంబుల, వికస్వరభాస్వరవల్లరీ తతిం,
గనుఁగొనుచు, న్మనంబున వికాసము నబ్బురమావహిల్ల, న
మ్మనుజ పురందరుండు వనమధ్యమునం జరియించు చొక్కచోన్ 90

అనుమానాతిగతోపమానమగు చాయన్, మంజరీ లీన ని
స్వనరోలంబకదంబ మూలమున, నంచత్పల్లవానీక సం
పనితాశోక యుగానుషంగి లవలీ వాసంతికా మల్లికా
త్త నికుంజమ్మున, ఁజల్వచప్రమున నందంబీను పూపాన్పునన్ 91

పుడమినొక్కటఁజేరి, పుంజీభవించిన
భవ్య లావణ్య సంభారమనఁగ
ముల్లోకములఁదెచ్చి పూని యొక్కటిఁజేసి
పోతపోసిన కాంతిపూరమనఁగ
వీక్షణంబులఁదోఁచి, నక్షీణప్రభమయి
వఱలు సౌదామినీ వారమనఁగ
నిమ్మగ నొకరూపు నెనసి, వర్తిల్లెడి
సౌందర్యసర్వస్వసారమనఁగ
మరుని శరపంచకమ్ము సామర్థ్యమొసఁగి
సానదీర్చిన యాఱవశస్త్రమనఁగఁ,
గందునందని చందము నందమంది
చెలుల చెలిమిఁజెలంగెడి చెలువఁగనియె 92

మునుపఖండాద్భుతరస సంపూర్ణుఁడయ్యె
సరవి నింక మహోజ్వల స్వరసుడయ్యెఁ,
గాంచి యొదలవంచె నయ్యంచితుండు
పంచనారాచుఁడించు విల్లంచు వంచె 93

కాలుసేతులు కదల వొక్కరవ యేని,
దారుభావమ్ము నెనసె భూదారుఁడెపుడొ!
మేనితొడవుల రతనాల మేలిజిగులు
దొనఁకులాడుట గన, వేపథువునఁగాదె? 94

మనసిజాత ముక్తమార్గణ ఫలరీతిఁ
బులక లెసఁగెఁబురుష తిలకు మేనఁ,
గ్రమ్మె నిమ్ముగఁజిఱుచెమ్మటలు, ఁదదస్త్ర
స్రుత మరంద బిందుబృందమనఁగ 95

పుండరీక నయను పొల్కిఁదెల్వెడి కను
ల్పమ్మదాశ్రు మధురసమున నిండె,
భూవిభునకుఁదలఁప వైవర్ణ్య మొదవెను
సాత్వికమ్మొ? కాక తాత్త్వికమ్మొ? 96

మనమున విస్మయమ్ము ననుమానము నాశయు సంతసమ్ము వి
న్ననువును ధైర్యమాదిగ గొనంబులు పెన్గొని, మోము నెత్త, న
య్యన తిలకుండు మోహినుల కేనియు మోహముఁగొల్పుటెక్కు నె
క్కొను జవరాలి నెమ్మొగము, ఁగొంకక యింకొకమాఱు గన్గొనెన్ 97

రమణీ వప్రబలంబునం దనకుఁజేర న్రామి శంకించి, య
క్కొమనెమ్మేని బెడంగు హంగుల మెఱుంగుం జాలుతోఁజెల్మిఁబూ
న మనంబుం బురికొల్పి, చూపు వెనువెంటంబంపె నమ్మేదినీ
రమణుం, డేమి యెఱుంగఁజాలు వలయార్థం బంగుళీయంబుగాన్

మనము లీనత గనియె నమ్మగువ యంద,
తన్నివిష్టత గొనెను దద్వర్గమెల్లఁ,
నడుగులాదారివట్టె గతానుగతిక
మేకదా! లోక మావిభుం డేమిసేయు? 99

ఆ నృపవర్యునిఁగను గొని
మానవతీ మణులు సంభ్రమమ్మున నభ్యు
త్థానం బొనరించిరి, విసు
మానంబును భయము సిగ్గు మనమునఁగదురన్ 100

అరుసముఁగూర్చు సొమ్ము గడు నందము గందముఁజిల్కినట్టు, లీ
చెరువు నిజంబు పేరుగల చిన్న కయీసరుఁడిట్లొనర్చు చా
ల రవణ సుందరేశ్వర విలాసము నాఁదగుఁదెల్గు కబ్బమం
దరిగెను గెంపు రెండవది తద్దయుఁబెద్దలుఁబెద్దసేయఁగన్ 101



# తృతీయాశ్వాసము

ఇంచుమించులనగ(జాలు నించుబోండ్ల
మేలి నెమ్మేనికాంతులు మెలసి మొనయ(
దద్వనాంతరమెల్ల(గ్రొత్తందనమ్ము
పిక్కటిల నొక్కసారి తళుక్కుమనియె 1

ఆ చకోరాక్షి, విభురూప మాత్మనెంచి
యెంచి, తద్భావ మెనసిన సంచుదో(ప,
భావభవ భావినీ త్రపా భావ వివశ
వృత్తిమై డెందమున వితర్కింప(దొడ(గె 2

ఈ ఘనుం డెవ్వ, (డిందుల కేలవచ్చె,
వచ్చె(గా, కేల నామది మెచ్చువలయు,
నేమి సంబంధమైన యిదేటి మాట
పూర్వజనికర్మవాసన(బొరయరాదొ 3

ఏమని నుతింతు వీని, నాకేమి పని ను
తింప, నైన నీఘను నుతియింప కూజ
కుందు నెట్టులు వర్ణింప నోప(గలనె?
యెపుడును గాక పూర్వపుణ్యోపక్లుప్తి 4

సూనశరాసు(గన్న సొగసుందనమున్, జలజాత బాంధవ
శ్రీనిలయంబు కన్ను(గవచెల్వు, జగంబుల నేల(జాలు నా
జానుగ బాహుదండముల సొరులు నీతని కొప్పు(గాక, యిం
కే నరకిన్నరామరుల కేనియు నన్యుల కేని(గల్గునే? 5

రాజు కళంకితుండు, రతిరాజభిభూతశరీరు, (డంబికా
రాజు దిగంబరుండు, ఋతురాజనవస్థవిలాసు, (డశ్వినీ
రాజులు(బోల, రింక సురరాజసుతుండును(జాల(డట్టె, రా
రాజుకొమారు(డేమితగిరాజను నీ దినరాజ రాజికిన్ 6

కరము లింకొక రెండును గలిగెనేని,
పేరురమ్మున(గౌస్తుభశ్రీ రహించె
నేని, శంఖచక్రమ్ముల నెనసెనేని,
నలినలోచను(డీత(డనంగ వచ్చు 7

ఈ సింగారపుఱేఁడు సంతతము నెంతే నానుకూల్యమ్మునన్,
వాసి న్మన్ననఁగూర్పఁబెంపుఁగని విశ్వం బేలఁగాఁజాలు ను
ల్లాసం బందెడి భాగ్యమేసతిదో, యేలా నాకిదేగోల యో,
దోసంబేమి యటంచు నయ్యతివ చేతోవృత్తి నగ్గింపఁగాన్ 8

పూని, నెమ్మనమ్ము మాననీయుని రూపు
హృదయఫలకమున లిఖించి, యిందు
నేమి కొఱఁత గలదొ యెంచి కాంచు మటంచుఁ,
బట్టు పట్ట మఱొకపరిఁగనుఁగొనె 9

ఎంత వడికినేని, యీచూపులు నృపాలు
పాలివీడి, మగిడి యేలరావు?
నేన పోయివత్తునే యని యేమొ? య
య్యతివ నెమ్మనమ్ము నరిగె నటకు 10

అక్షగణమునకెల్ల నత్యనుగతములు
గనులు, డెందము నచటనే గదలకున్న
నేమి సేయుఁగృశాంగి? యింకేమి గోరుఁ?
దాలిమిం దక్కి యుండె నున్మత్త యనఁగ 11

తంద్రయనంగరాదు కనుఁదమ్ములు మూయమి, జాగరూకతా
మంద్రయుఁగాద యింద్రియసమాజము చేవలు దక్కియుంట, నా
చంద్రముఖీలలామ తన సంగతి యన్యులెఱింగినం ద్రపా
రుంద్రతఁగాంచె శంబరవిరోధి శిలీముఖపాత రుగ్ణతన్ 12

మనమె లేకున్న సంకల్ప మనఁగ నెద్ది?
తలఁప నిర్వికల్పం బనఁదగును గాక!
నృపునిఁగనినంత నేవియో యుపదశములు
భావినికిఁదోఁచె భావజావస్థ లిట్లు 13

అంత నాసరసుఁడు నంకురితంబగు
నాత్మరాగ లతిక నతివ మేని
మేలిజిగులఁబెంచి యాలోక గుణపాళి
నల్లువెట్టి, తలఁచె నిల్లలి మది 14

స్వరిలాతత్త్రులమందు నెందు నవిభావ్యశ్రీలఁబొల్పొందు సుం
దరు లీ యుగ్మలికాలిగోటి కొనకైనం జాలరీ, బాల నా

సరసీజోద్భవుఁడా సృజించెఁదలఁపన్? సర్గప్రగాళిన్ ఘృణా
క్షరరీతిన్ స్ఫురియించెఁగా కఠినవస్త్వాయ న్మనోజ్ఞాకృతిన్ 15

క్షీరవారాశిఁదోఁచిన పాప యిదియని
పాలుఁగాఱెడి మోము బయలు పఱచె
రేవెల్గు తోఁబుట్టు వీవాము యనుచు
వెన్నెలఁజిల్కు చిఱునవ్వు చెలువు దెలిపెఁ
గల్పక సహవాస కలిత యీసతి యని
పల్లవారుణ నఖప్రభలు వలికెఁ
గమలవాసిని యీ వికస్వరాక్షి యటంచు
నడుగునెత్తమ్ముల యంద మనియెఁ
బుండరీకాక్షు వక్షోవిభూష యీ నె
లంత యనుమాట నెమ్మొనికాంతి నొక్కి
చెప్పె, వేయేల యీ మేలిసిరులు తళుకు
బెళుకులును గుల్కు మెలపు లన్యలకుఁగలవె? 16

ఈ రామామణి పొందు లేనియెడ నా కేలావిభుత్వంబు, చె
ల్వారామంబునఁగాయు వెన్నెలయ కాదా? యింక నిష్ఠోచిత
ప్రారంభమ్ములు వేయునున్నఁబనియేలా యంచుఁజింతించి, య
వ్వారిం జేరి తదీయ సత్క్రియల భావం బుబ్బఁగా నిట్లనెన్ 17

సంభ్రమమ్ము వలదు జలజాక్షులార! న
న్నెఱుఁగరేమొ? పరుఁగ నెంచఁబోకుఁ,
డుత్కళాధిపుండ, నొంటివచ్చితి నొక్క
పనికి, మాఱుదారి వడితి నిచట 18

దానవుం డేఁగుదెంచె దుర్దాంతుఁడొక్కఁ
డీయెడకు నింతకు మ్మునుపే లతాంగు
లార! మీరలు గనుఁగొనినారె? తద్వి
ధమ్ముఁదెల్పుఁడు, పాపుఁడేదారిఁజనెనొ? 19

నే నాతని మార్కొని, త
త్సేనలఁబరిమార్చి, యొడలు సిల్లులు వఱుపం,
బ్రాణముల తీపిమై నీ
కాననమధ్యమ్ము సొచ్చి కనుమఱుఁగయ్యెన్ 20

వెనువెంట, వెమకుచుంటిని
దనుజేంద్రుని గీటడఁప, నదః ప్రాంతమునం
గనుఁ, గొంటి నమానుష రూ
పను సిరిఁ బెంపఁజాలు పద్మదళాక్షిన్ 21

ముదితలారా! చిత్తంబు ప్రమోదపూర
కలితమయ్యెను మిమ్ముఁగన్న యంత
నేమి సంబంధమో యిది యెఱుఁగఁగలరె?
మున్ను నాసామ్మె యీ జగన్మోహనాంగి 22

అనుచు నేమేమొ పలుకు, నాయాయిఁగాంచి
పక్కుమని నవ్వి యిట్లనె నొక్క పడఁతి,
బాగు బాగేడ నేర్చి తీలాగెవండొ
దానవుండంట! తా దారి దప్పెనంట! 23

ఎక్కడి మాటలయ్య, మనుజేశ్వర! నవ్వరె? విన్నవారు నీ
వక్కట దారి తప్పితివె? యన్యులు లేరటె! యాఁడు వారలే
చిక్కిరె తెన్ను సూప, ఁగడుఁజిత్రము యింతటివారలేనటే
రక్కసి మూక నొంపుట లరాతులఁ జంపుట నమ్మవచ్చునే 24

అది యటులుండనిమ్ము, మనుజాశన సంచరణమ్మునన్ భయా
స్పదమగు చోట నంగనలు పాటలు మాటలు నాటలొప్ప స
మ్మదముప్ర బ్రొద్దుపుత్తురటె, మ్రాన్పడి కేకలు వెట్ట కుందుర
ట్టె, దనుజునిం గనుంగొనిన డెందము కొందల మందనార్తిమై 25

ఇక్కడనంటిగాక, యిఁక నెక్కడనైన వచింపఁ బోకుమీ
టక్కరి మాట, లెంతటి బడాయిలకోరువొ గాక, యెవ్వడో
పుక్కిటి గాథ లల్లికొని మున్నెపుడో యిది నాదు సొత్తనన్,
డక్కుదు రొక్కొ కన్నియ లొడంబడి శీలము సిగ్గు నెగ్గఱన్ 26

మేనమామ కూతురా నీకు నీకన్నె?
పుట్టినపుడె పేరు వెట్టినావె?
ముక్కుమొగ మెఱుఁగని ముద్దియంగని యిది
నాది యన్న జెల్లునా? మహీశ! 27

ఐన నీజోలి మాకేల? యో నరేంద్ర
మౌళి! మధురా పురాధీశు పాలికేఁగి

యాఘనుఁ డొసంగఁగొనుము ధర్మ్యముగఁ, గన్న
వార లరుసము నసమును బడయ వలదె 28

రేపొ మాపొ స్వయంవరంబీ పడంతి,
దక్కడనె చూపుమయ్య నీటెక్కులెల్లఁ,
బలుక ఁదడవయ్యె, నిటు పెఱవారితోడ
మగువలకు ఁజెల్లునే యిన్ని మాటలాడ? 29

పోయివచ్చెద మంచు బూఁబోఁడి యనుఁగు
సకియఁదోడ్కొని తత్పరిసరము వాసెఁ,
దక్కుగలలేమలెల్ల నదశ్చరితముఁ
దలఁచి లోలోన నవ్వుచావలకుఁజనిరి 30

విభునిఁగనఁగోరు, ఁజెలులకుఁబెదరి యుడుగుఁ,
గొసరి యేమేమొ లోలోన గొణిగి కొనుచు
నడుగుసాగద, సాగక యాగరాద
యింతి యప్పుడు మివుల రాయిడికి నయ్యె 31

తెలిగొారు న్వెలిమావు కల్పకములు న్దివ్య న్మణు ల్వేలుపు
న్నెలఁత ల్లచ్చియుఁదన్నువీడి చన మున్నీరున్న చందంబునం
జెలువాఱె న్వనమెల్ల, నాయెడ నిజశ్రీలన్న చెన్నొందు కాం
తలు వాయంగ నొకండ యుండ వలసె న్థాత్రీశ్వరుండండ గన్ 32

వనతల మతిక్రమించి, నెమ్మనము దక్కి,
యా నలిననేత్ర చతురంతయాన మెనసి,
సకియ లుచితోపచారము ల్సలుపగఁజని,
సొచ్చె నమరావతికి సరివచ్చు నగరి 33

అల్లావణ్యపు బొమ్మ, తన్నగర రథ్యాపంక్తులన్ వేడ్క సం
ధిల్ల న్మంగళగీత మొప్పఁగ, ఁబురంధ్రీరత్నము ల్సేసలం
జల్ల, న్మించిన వైభవస్ఫురణఁబ్రాసాదమ్మున న్సొచ్చె, ను
దృల్లాలిత్యమునం, దదోచిత మృదు వ్యాపార మేపారఁగన్ 34

వెలఁది రాగ ప్రవాహమ్ము వెల్లివిరిసి
జగము నెల్లెడ ఁగ్రమ్మిన సరణిదోఁపఁ,
బరిదళిత పద్మరాగ సంపద్దరమ్ము
గ్రాలె జరఠారుణ మరీచిజాల మపుడు 35

ఎంతవారలైన నింతులఁగనుఁగొని
యాత్తరాగు లౌదు, రది సహజము!
భాస్కరుండు నకట పశ్చిమాంగనఁజేరి
నంత రక్తుఁడయ్యె, నన్యు లెంత? 36

సుమవిశిఖుండు దాడి సనుచో, నలఁదన్నమయుండు పూని య
స్తమయ గిరీంద్ర సానుతలిఁజయ్యన దీసిన రక్తగంధ క
ర్దమ ఘుటినాఁగ మండలము రాజిలె, నయ్యది వోవ, సావశే
షమగు శిలాతలం బనఁగ సంజయు నొప్పెసలారె నంతటన్ 37

తమ్ములకు నెల్ల సంపద ల్దఱిగె, ఁజక్ర
ములకు భేదమ్ము హెచ్చె, ఁగుముదము లెసఁగఁ
జొచ్చెఁదామస మిల్లడవచ్చె జగతి,
కంశులఱి లోకబాంధవుం డస్తమింప 38

తమముల నేర్చలేదొ, దురితంబుల వాపఁడొ, మేళ్లనీఁడొ, క
ర్మములకు సాక్షిగాఁడొ, వసుమంతుడుగాఁడొ, వెలుంగొసంగ లే
దె, మహితపూజ్యుఁడై యశము తేజమునందగలేదె మిత్రుఁడా
సమయము చాలకోజమతె సంపద లెప్పుడు శాశ్వతమ్ములే? 39

పక్కులు వాఱె దిక్కులకుఁబద్మచయంబులు వంతగూరె, ఁబెం
పుక్కఱఁగూసె జక్కవలు, నొక్కట ఘూకగణంబు తేసె, వేఁ
డెక్కిన ఱాలుఁజల్లవడె, నెల్లెడ వల్లవడెం దమంబులు
న్మిక్కుటమయ్యె నయ్యినుఁడు నీల్గిన రాజ్యమనంగ రాజ్యమే? 40

గహనములఁజొచ్చి, లోకము కన్నుఁగప్పి,
కుముదముల నంటి, భృంగనీలిమ హరించి,
యొక్కవడి మించి, వెలుఁగున కులికివడెడి
దొంగలన నొప్పి, చీఁకటు ల్దొంగి చూచె 41

చక్రవాళము దాఁటి సరసీజనాభుని
మేని మేల్దాలుతో మేలమాడి
ప్లక్షంబు శాల్మలీవృక్షం బెనసి వచ్చి
జంబూఫలంబుల డఁబు మెచ్చి
శివునికుత్తుక సేవసేసి తదర్ధాంగ
కైశ్యమ్ము తోడ సఖ్యంబు నెఱపి

భృంగసంతతిఁబల్కరించి కాటుకకొండ
నుండి యధ్వశ్రమం బుడిగి కడఁగి
యింద్రనీలమణికాంతు లెంచి నొంచి,
మించి జగమెల్లఁదనరూప నించి, ధూమ
పటలికల నాశ్రయించి, యప్పాట ముంచి
యఖిలము భ్రమించి, తిమిరము లాక్రమించె 42

యమునానదీప్రవాహమొ?
సమద మృగాక్షీకటాక్ష సంతానంబో?
కమలాసనాండ భాండాం
తమునం దెల్లెడను నలుపనంగిపెనంగెన్ 43

విష్ణుపదము నందు వెలయంగ, సమయుండు
చల్లినట్టి కుసుమ సంఘమనఁగ,
నిరులనడప వచ్చు నిందునిబంట్లనఁ
దారకాగణంబు తవిలి వొలిచె 44

అంతం బురంద రాశా
దంతావళరా ట్ఛిర స్ఫదన్యస్తంబౌ
సంతత సిందూరం బన
నెంతయుఁబ్రాగాననమున నెఱ్ఱన దోఁచెన్ 45

కళల న్మించినదిట్ట, చీఁకటులమూక ల్పించుజో, దైంద్రికిం
జెలువౌ పాపటబొట్టు, జక్కవలకుం జేటిచ్చు భూతంబు, వే
ల్పులకుం బువ్వ, జనాళి దృక్కుముదినీమోదానుబంధమ్ము త
మ్ములకుం గన్నులమూఁత, వొల్చె శశి తూర్పుంగొండపై దండపై. 46

ఉదయపర్వత గైరిక మృదితుఁడయ్యొ?
ప్రాఁచిపయి ననురాగంబు దోఁచి యొక్కొ?
యిరుల మూఁకలపయి ఁగిన్క నెనసి యేమొ?
రక్తుఁడై గనుపట్టెను రాజు మివుల 47

విచ్చెం దిమిరగణ, మ్మరు
విచ్చె సిరు ల్దొవల కబ్జ, మింపున మూతు
ల్విచ్చెఁ జకోరులకుం, జను
విచ్చెం గుముదినులు తేంట్లకెల్లఁజవి గొనన్ 48

కువలయప్రభుఁడుదయాద్రి గోపురంబు
నెక్కెనో లేదో కర్తవ్య మెల్ల సలిపెఁ
దత్కరంబులె యిఁక వియత్పథ మెనసినఁ
దనకళంకమ్ము లోకులు కనుఁగొనుటకె 49

అంత నంత, రాగ మపగత మ్మయ్యెను
సహజమగు తెలివి యెసంగి మించె
ధవళకిరణు, ఁడెన్న ధర నెల్ల కాలంబు
నున్నె? తెచ్చివెట్టికొన్న సొమ్ము 50

మానగ్రహగ్రస్త మానినీ మానసం
    బులతోడ శశికాంతశిలలు కఱఁగెఁ
బుష్పేషుసంక్షుబ్ధ ముగ్ధాత్రపాభరం
    బులతోడ నిరులు దిక్కులకు వాఱె
సంకేత యాతాభిసారికా పరిమళం
    బులతోడఁగల్వతావులు ఁజెలంగెఁ
భాస్వద్వియోగ సంప్రాప్త క్షతి సరోజి
    నులతోడఁజక్రవాకులు గలంగెఁ
జెఱకువిల్లుకాని సింగిణి సడితోడఁ
దరుణగణము గుండె దడలు హెచ్చె
జారసంఘ తత మనోరథమ్ములతోడ
శశధరుండు నాకసమున కెక్కె 51

రాణఁదలిర్చి పేర్చి ద్విజరాజయి సంతమసాళికెల్లకున్
హాని యొనర్చియుం గువలయ ప్రభుఁడయ్యు జగంబు లెంచనౌ
స్థానము నాక్రమించు సుతుసంపదఁగాంచి సముద్రుఁడుబ్బె, స
త్సూనుల వైభవ ప్రభలఁజూచిన తండ్రులు మోద మందరే? 52

గట్టురాపట్టిఁజేపట్టినదిట్ట సా
    మేని మేల్తళుకుల మెలపులనఁగఁ
జెల్వారు చెంగల్వ చెల్వాల నగుమోము
    చెల్వు గాంచిన రాజుస్మితము లనఁగఁ
జెన్నుమీఱెడి యన్నుమిన్నల కురుల వి
    రుల దండ గముల సిరులివి యనఁగ
రుద్రునియష్టమూర్తుల వేనొకఁడనని

యాకసం బెనసిన యరుసము లనఁ
బాలమున్నీటి తరఁగల బారులనఁగ
జగము గెల్చెడి మరుని యశమ్ములనఁగ
బంబిన చకోరముల నోము ఫలములనఁగ
లలితవృత్తులఁబండువెన్నెలలు సెలఁగె 53

అన్నియుఁదెల్లదీవు, లిఁక నందఱు రుద్రునిబోఁలువారె, గ
ట్లన్నియు వెండివే, గజములన్నియు నభ్రగజమ్ములే, మీఱుచె
ట్లన్నియు బుష్పితంబులె, దిగంగనలెల్ల దుకూలమూని, రే
మున్నది? లోకమెల్లఁదెలుపొక్కటి మిక్కుటమై రహింపఁగన్ 54

ఆ నలినవైరి వెలుఁగులసోనలు, మల
యానుగత పవమానుని కూన, లెసఁగు
మీననేత్రల కడగంటివాన, తోడు
రా నసమబాణునకు గెల్వరాని దున్నె 55

అనుకూల చాటు విన్యాససంతుష్టలౌ
స్వాధీనపతికల చందమెసఁగె
దక్షిణప్రణయవిధా సలాలిత్యమౌ
వాసకసజ్జికా స్వాంత మలరె
శఠ సానునయవాక్యఝరి బిట్టు సడలని
కలహాంతరితల కోర్ఫులు నడంగె
ధృష్టప్రచార సంరుష్టాత్మలౌ ఖండి
తలకు నెంతయు నూరుపులు సెలంగెఁ
దాల్మిసెడి విరహోత్కంఠితలు తలఁకిరి,
కరము ప్రోషితభర్తృకాగణము లడరె,
వరుఁబ్రతీక్షించి విప్రలబ్ధలు కలఁగిరి,
తెలివి నభిసారికలు విట కుల మెనసిరి. 56

తగ సయోగులు తక్కంగఁదక్కువారి
కెల్లరకు జీవనాతంక మిడెను, మరున
హంకృతులును, దదంగనా హుంకృతు, లళి
ఝంకృతులును, బికాంగనా కుంకృతములు 57

అతనుఁడు, తూఁపులైద, యవియన్ననొ పూవులు, దంటువిల్లు, భృం
గతతి గుణంబు, చారులు శుకంబులు, బంట్లు పికంబు, లల్పమా

రుతుఁడరదంబు, కాననచరుండు సఖుండు, జగంబు గెల్చునే?
యతఁడిఁక గెల్చుఁబో తనకు నండగ నండజయాన నిల్చినన్ 58

సమయనిష్ఫూతఁ బాండవు ల్తమకునడఁగ
మించి భూమండల మ్మాక్రమించు మామ
బలిమి దుర్యోధనుండన బంచబాణు
డేఁచె నంగనాథుని ప్రాపు నేపు సూచి 59

మారు తొల్లింటి కీరితి మారకుండ,
రతి యవర్గళ వైభవగతి నెసంగ,
స్త్రైణపౌంస్నానురాగ రసప్రవాహ
భరము వెన్నెలయన వెల్లివిరిసె నంత 60

అమృతాంశూపలకుట్టిమస్థల నవోద్యచ్ఛ్రీకమౌ మేలిహ
ర్మ్యమునన్, బంగరుమంచె, నంచగరులం బన్నీరుఁజిల్కంగ నొ
ప్పమరుం బాన్పపయి, న్సచామర కరల్ప్రాణప్రియ ల్గొల్వ, సౌ
ఖ్యమన న్నాక, తలంచుచుండె నొక కన్యారత్న మేధన్యునో? 61

చెలులకును మాఱువలుకదు, చిలుకకేనిఁ
బలుకుసెప్పదు చిఱునవ్వు చిలక, దులికి
పడును దత్తరపడు, భ్రమపడును, గలఁక
పడు, దురంతచింత నప్పద్మగంధి 62

తోఁచె నెప్పుడొ యిది దృష్టిదోషమనుచు
నువిద యోర్తుక వెసఁజని యుప్పుకల్లుఁ
ద్రిప్పి వైచె నొకర్తు మంత్రించె గాలి
సోకె నీకె కటంచు నాసుదతికపుడు 63

ఒక్కచెలియ జడిసెనో యేమొ యీబేల
యంచు వేరు దెచ్చి యాంక్ష గట్టె,
నొకతె మేను నిమిరి యోయమ్మ యీయమ్మ
కింత జ్వరమె, యేమి వింత యనియె 64

అంగనలెల్లఁగొంతవడి, కంగి! యి కేమి యనంగ వచ్చు నీ
యంగద కగ్గమయ్యెఁజెలి యంగజు తూపులకోపలేక యం
చుం, గడు సంభ్రమంబున విచోళగతి న్నలినీదళంబు గ
ప్పంగ, నొకింతలో మిలిక వాఱెను నిప్పుల నప్పడంబనన్ 65

తోయ మొలికింప క్షణమున మాయమాయెఁ,
గ్రప్పుం బలుకిడ్డ భగ్గనియె, మృదు మృ
ణాలహారము లళిపంక్తి లీల నెనసె,
గందపుంబూఁత బీటవాఱెం దనువున 66

అంతకంతకు నగ్గలంబగు మనోజ
బాధలకు నగ్గమౌ నింతి పాటుఁగాంచి,
కలఁకఁదేర్పగ నింపగు కరణి నిట్లు
వలికి, రుపచార చతుర భావమునఁజెలులు 67

కోమలీ! సౌఖ్యమునఁబాలుకొందుము గద
కష్టమందును వలయు భాగంబు మాకు,
నాప్తవర్గ నివేదితమయిన దుఃఖ
మాత్మకును సహ్యవేదన మగును జూవె! 68

అమ్మ! పరాయివారల మటమ్మ, తలంపవటమ్మ, మమ్ము, నీ
యుమ్మలికమ్ముఁగాంచి యెటులోపుదు మమ్మ!, వరాల బొమ్మ!, మీ
యమ్మ యెఱింగినం గలఁగునమ్మ!, యిదేమి తెఱంగులమ్మ! మా
యమ్మ గదమ్మ!, నీదు హృదయమ్మును దెల్ప గదమ్మ!, యిమ్ముగన్69

ఒక్కటే ప్రాణమని నట్టులుండి, యొక్క
కంచమునఁదిండి తిని, యొక్కమంచమునఁబ
రుంటి మేమైన మనలోఁబొరుపులని కల
వే? లతాంగి! మాఱుపలుకవేల మాకు 70

మాలో దోసంబేదియు
లోలాలక! లేదుకద, విలోలధృతిన్ నీ
వీలలి నాకుల వయ్యెద
వేలా, కారణముఁదెల్పవేలా బేలా! 71

అంగజు దోసకారితనమా? తరళేక్షణ! యిద్దియన్న నా
యంగన యుల్కిపాటును భయంబును సిగ్గను దొన్కులాడ, నో
వెంగలులార! యేదో మది వెన్కటి గాథఁదలంచునంతలో
నం గలగుండు సెందవలెనా? యన నవ్వుచు నా సఖీమణుల్ 72

యేమి యాగాథ, దానికిదేటి బాధ,
తెలియఁజెప్పఁగదే మాకుఁజెలియ!, చెప్ప

కున్న మాపయి నాన సుమ్మన్న, దప్పు
లేక యాలేమ యొక ఫక్కిఁగైకొని యనె 73

రాజు స్వరసుండెసఁగు నధిరాజపదవి,
నతివ యామాఖ్య, యనుషక్త, యతనిఁగొలుచు,
నన్ని భోగమ్ములున్నవా యున్నతునకు
నతనికిం గల్గెఁబుష్కరుండనెడి సుతుఁడు 74

తండ్రి గొనములు వీసమంతయును గలుగ
వా కొమరునందు శబ్దించు నతఁడు, తల్లి
దుర్గుణము దోఁచె వాని యందు, నతని సుతుఁ
డాశుగుండన, దత్పుత్రుఁడనలుఁడనఁగ 75

అనలుకుఁబుట్టె శంబరుం, డతని కూఁతు
రయ్యె వసుమతియన, వీరలంద ఱొక్క
కట్టొకరి కన్న నొక రధికంబు గుణులు,
వీరికిం గాని దేది యీ విపుల లేదు 76

వీరలెల్లరు పూని యష్టారమనెడి
పురము గట్టిరి, యంగభూములను గోపు
ర నవకమ్మెసగంగ సర్వ వసతులను
గూర్చ, దుదకయ్యె జ్ఞాతులకు న్వశంబు 77

అందఱి కన్న ముందు, స్వరసావనిభర్తకు యామ దుర్గుణా
స్పందిత కాక మున్న ప్రభవంబెనసెం దనయ ద్వయంబు, ని
ష్పందుఁడు నాప్తకాముఁడనువారలు, నిద్దపుఁదండ్రిపోల్కి, తా
మందిరి, యాప్తకాముఁడు దురాశలఁబోయెడు నప్పుడప్పుడున్ 78

పుష్కరాదుల దౌర్బల్యమును గనుగొని,
యాక్రమించిరి వారిద్ద ఱాపురంబు,
నాత్మ పరివార మెప్పుడు నమరికొల్వఁ
గొల్వుఁదీరిచి రవ్వీఁడుఁగొమరు మిగుల 79

తల్లి తెచ్చిన భోగ్యసంతాన మెల్ల
నాప్తకాముఁడు చవిచూచు, నన్యుఁడొల్లఁ,
డన్నదమ్ములకిదె భేదమంతె కాని,
యిరువు రొకరూప, వ్యష్టి భేదరహితగతి 80

శాపవశత ననుజుఁడు స్వశక్తిఁగనఁడు,
తెలిసినందానె రాజు కాఁగలఁడు, కాని
వారి పరివారమున నొక వామనయన
కలదు ధిషణయనం, గళాగతి మనోజ్ఞ 81

తమ్ముఁడొకఁడు కలఁడు తన్వికిఁబ్రత్యయ
నేయుఁడనఁగఁదఱచుఁబాయరొకరి
నొకరు వారికి నయిదుద్యాన వనములు
విహరణోచితములు వెలయుచుండు 82

భటులు గల రైదుగురు వనపాలు, రెపుడు
వారలెది గోరునప్పుడ వ్వనము సూపుఁ
దదధిపుఁడు, నందుఁదమ్మని తలఁపులనుమ
తించు, నొప్పిన నెంచు, వారించు ధిషణ! 83

అరవింద కోశ కంతో
త్తరతారానిలయములన, ఁదనరారు మనో
హరములు ప్రాసాదమ్ములు
హరిసౌధసమమ్ము లమరు, నా నగరమునన్ 84

స్వరస భావానువిద్ధ ప్రభావ గతులఁ
గులుకు నిష్పందుఁడరవింద కోశమందుఁ,
దక్కు గల రెంటఁదిరుగు నాతని యనుజుఁడు,
నన్నతో నుండు రసికుఁడై యప్పుడపుడు 85

తారానిలయంబందు, ను
దారుండై యాతఁడున్నతఱినగు జనసం
చారం బాపురి, ఁగదలం
గా రా, దతఁడన్య సౌధ గతుఁడైన యెడన్ 86

కంఠోత్తర సౌధమ్మునఁ
గుంఠితుఁడై యతఁడు తెలియఁగోరఁడుజగ, ము
త్కంఠఁబెనుప, వెసఁజను గుహఁ
గంఠీరవ మనఁగ, నన్నగారిఁగన నటన్ 87

చడియుఁజప్పుడు వొడమ దాసదనమందు,
నెవ్వరున్న తెఱంగైన నెఱుఁగరాదు,

యింటి వెల్గు గనుంగొని, యింటి వారి
యునికి దెలియంగ వలయు నో యువిదలార! 88

ఇట్టులుండంగ, నిప్పుందు నింపుసొంపు
నింపు గుణగణముల విని, నెమ్మనమున
నలరి, బద్ధానురాగయై, యతని పొందు
కై కడు న్వందురెను ధిషణాకుమారి 89

వరురూపుం గన నొక్కమాఱు నిభృతవ్యాపారయై మించు త
త్పరతం, దా నరవిందకోశ మహిత ప్రాసాద పిచ్ఛంద నాం
తరము న్వొచ్చెడు నాప్తకాము వెనువెంటం బోయి, యాకన్నె య
ప్పరముం గాంచెను, వాని వైభవముఁజెప్ప న్నామి నెంచె న్మదిన్ 90

ఆప్తకాముని జాడయు నచట లేద,
యున్న వాఁడొక్కఁడే మహిమోన్నతుండు,
సిగ్గిలినొ యేమొ సౌధంబు దిగ్గున దిగి
చనె, యథాపూర్వ మాప్తకామునిఁగనుఁగొనె 91

పోలికలు రెండు నొంటిగాఁబొరయు చుంట,
నీతఁడే యాతఁడన మదినేదొ వెలితి
దోఁచె, నప్పు డేమూలనో దోఁచకుండ
నుండ నోపెడు నని యెద నూఱడిల్లె 92

ఆప్తకాముఁడు వెలినున్న నఱుగనీయఁ
డటకు, నచ్చట నున్న నే మనునొ నన్న
టంచు, ధిషణ మదిఁబలువరించు, ఁగలవ
రించు, విరహాగ్నిఁబడి తపియించు నార్తి 93

ఆ ధిషణమూర్తినిఁదలంచినంత, నా మ
నంబుఁదత్సమగతి నంది నవసె, నంతె
గాని వేఱొండు లేదను కన్నియ విని
ఫక్కుమని నవ్వి, సకియలు పలికి రిటులు 94

ఎంతటి కవయిత్రివి నీ,
వింత చమత్కారగాథ యెపుడల్లితివే?
కాంతా! తత్సమగతి నీ
స్వాంతం బనుమాట యొకటి సత్యమ్మ సుమీ! 95

అతివ! యిందలి చివరి కథాంశమెల్లఁ
ద్వదనుబంధియ, సన్నకు వచ్చె మార్పు,
దాఁచుకొన్నను దాఁచుకొమ్మో చకోర
నేత్ర! తెలియంగలేమె నీ నిజము లెల్ల 96

అనిన, గనుతొవతేకుల నశ్రుకణము
లొలికి, పౌరందరమణి కాంతుల సృజింప
గుట్టెడలెఁగా యనుచు, సిగ్గు కొసర, వెచ్చ
నూర్చి విన్నఁదనము దోఁప, నువిద పలికె 97

ఏలా! యీ పరిహాసము
లోలాలకలార! నేన లోకువయితి, సం
బాళింపక పోఁగా, యిటు
వేళాకోళము లొనర్ప విధియే మీకున్? 98

అనిన విని నెచ్చెలు ల్వల్కి, రమ్మ! నీదు
కత తెలుఁగు మెచ్చినా మంతెగాని, నీ మ
నంబు నొప్పింతు మొక్కొ, హితంబుఁగోరు
వారలము గామె? శతపత్రపత్ర నేత్ర! 99

సుందరి! మాత్రమైన వినుఁజూడక యుండగలార మొక్కొ, నీ
డెందము కుందనొర్చెదమటే, పెఱవారలమే తలంప, నీ
కుం దగువాఁడు వాఁడు, వెడఁగుందన మందకు మమ్మ, నిన్గనం
గొందల మందె వాని మదిగూడ నిగూఢ మనోజవేదనన్ 100

ఆ విభురామణీయక మహో! వచియింపఁదరంబె? వాని స
ర్వావయవానవద్య రమ యన్యుల కబ్బునె? యబ్బవచ్చులే
భావ విభావితాకృతికి భావజుమూర్తికి నేమి లాభ మా
ఠీవియు రాజసంబెసఁగు ఠేవయు గల్గునె? తెచ్చి పెట్టినన్ 101

ఆ కమనీయుఁగాంచి, త్రపనంది, యుమేశ్వరు కంటి మంటలో
స్వాకృతిఁబూదెసేసెఁగుసుమాస్త్రుఁడు, చెట్టులఁజేమలంబడెన్
వ్యాకులుఁడై వసంతుఁడు, జయంతుఁడు దేవగణాధిపాత్మజ
త్వా కలితానుభావుఁడయి, యద్దియె చాలు నటంచుఁగుల్కెడిన్ 102

అ మ్మహనీయు మోముఁగని, యంబుజ జన్ముఁడు తత్సదృక్ష బిం
బమ్మొద నూహసేసి, యొకమాఱు విధున్ సృజియించి, యంతరి

క్షమ్మునఁబాఱవైచె, జలజం బొనరించెను గాని, దాని నీ
రమ్మునఁద్రోచె నెందు సరి రామికి నేవగమంది, సుందరీ! 103

కన్నులా యవి? జగత్కల్యాణములు, సశ్వం
గారహేలా రసఖనులు గాని
భుజములా యవి? ప్రజాపుణ్యముల్ దిగ్దంతి
విశ్రాంతిద స్తంభవిధులు గాని
కరములా యవి? జనాదరణీయములు, వైరి
నరపాల కాలదండములు గాని
వక్షమా యది? లోకరక్షాచణంబు, సా.
మ్రాజ్యలక్ష్మీమందిరంబు గాని
పదములా యవి? త్రిభువ నాపన్నిరాస
పాలితాఖండ దివ్య సంపత్ప్రదములు,
నిఖిల రాజన్యమౌళి మాణిక్యకాంతి
సార సరసిజ వికచాంబుజములు గాని 104

ఇంతటి రూపవంతు సృజియించిన యంబుజ సంభవుండు, నీ
యంతటి యందగత్తియకు నాతనిఁగూర్పక యున్న, నున్న పే
రంతయు బీఱువోవ జనులందఱు నింద యొనర్చుచుండ, నా
వంతయు సిగ్గులేక యిఁక నొఁదలలెత్తి చరింప వచ్చునే? 105

ఆ నరపాలు వైఖరియు నప్పుడు గాంచితి మమ్మ, నీ పయిన్
వాని మనంబుఁజిక్కె నతివా! యనుమానము లేదు, వచ్చు రా
ట్సూనుఁడు నీ స్వయంవరము చొప్పుఁగనుంగొన రేపామాపా, భూ
మీనులతోడ రాణ వరియింతువు గాక మనోఽధినాథునిన్ 106

అని ఇంపుగ వచియించెడి
యనుగుం గత్తియల పలుకు లాత్మకు నమృతం
బునఁబోలెను బునరుజ్జీ
వన మొనరింపఁగ, మృగాక్షి భావము నందున్ 107

ఒప్పు విభుని రూపు నూహించి యూహించి,
యంతకంత కధికమగు మనోజ
వేదనం జలించి, విధుకిరణంబుల
దాడి కోర్వలేక, తలఁకి పలికె 108

ఏర! సుమాయుధుండ! త్రపయే విడనాడితివే? జగమ్ములన్
బోరన గెల్వ గెల్చితివిబో, యొక ధీరుని వీఁక దాఁకి నీ
దారగళంబునం బసపుదారపు గట్టితనమ్ముఁ బ్రోచె, నా
సారికె చావకుండ నిటు సాగితివే యిఁక నాఁడువారిపై 109

పౌరుష మర్థమైనఁగలపౌరుషమెల్లఁదదర్ధ మంచు, నా
ధీరుని జోలికేఁగి యరుదెంచితివీవు ననర్థమంది, నీ
సారము తెల్లమయ్యెగద చచ్చితి వింకను జచ్చుచుంటి, వా
గౌరి యనుగ్రహింబెనపిగాఁజరియింతు వఖర్వగర్వివై 110

మారా! నిర్జిత భవదా
కారున్ మద్విభుని గెల్వగా నేరక, నీ
వీరీతి, ఁదదనురక్తను
గారించెదు నన్ను, యశము గల్గునె దీనన్? 111

మేమె లేకున్న నీ జయంబేమి సాగుఁ,
గుంటు వడియుండు నెప్పుడో కుసుమ బాణ!
నీకె యాబుద్ధి యున్న లేనిదిఁక యేది?
బ్రతికి పోయెదు వారమే వెతయు లేక 112

దశకంధరుఁడసిఁగైకొనె
దశరథనందనుఁడు నతని ధనువు విఱిచెగా,
పశుపతియే యని చని యీ
దశ నందితి, వింకనైన ధర్మువు వలదే? 113

ఆ రక్షోనివహంబుఁజంపితివె? యిజ్యారక్షఁబేర్గాంటివే?
వారాశిం గలగించితే? శివధనుర్భంగంబుఁగావించితే?
మారా! రాముఁడవయ్యెదో వనితల న్మందించు నంతన్ నిశా
చారుం బొందున, ఁగానఁద్రిమ్మరులతో సఖ్యంబు మాత్రంబునన్ 114

తండ్రి పురుషోత్తముఁడు, నీదు తల్లి లోక
మాత, సోదరుం దరవిందసూతి, తాత
సాగరుఁడు, వీరిగొనము లేచాయ జనెనొ?
మామ పోలిక వచ్చెనుగా మరుండ! 115

నీలలోహితమౌళిమాణిక్యమైన
నేమి, సత్పథచరుఁడైన నేమి, కువల

య ప్రియుండైన నేమి, సుధాంశుఁడైన
నేమి, దోషాటుఁడీ మాడుమోము వాఁడు 116

ఆ కమలాప్తుతో సరియటంచును, వెన్నుని బావయంచు, ర
త్నాకర పుత్రుఁడుం గువలయప్రియుఁడంచు, నమర్త్యవర్గ భో
గాకరుడంచు, నప్పరముఁడౌదలఁదాల్చెను గాని, వీని యీ
పోకల పోవుటం గనిన, ఁబూదె యొనర్చుఁడె మారు దోడుగాన్ 117

అమృతకరుఁడంచు నామధేయంబ కాని,
సార్థకం బదికాదు రవంత యేని,
విసపుదోసమ్ము బడబాగ్ని వేఁడి, హరుని
కంటిసెగ కానవచ్చు నీకరములంద 118

అని, మదనుని వెతలంబడి
యను మానవతీలలామ యనుఁగుం జెలులో
య్యనఁబ్రియభాషణముల నె
మ్మన మలరించి, రిటు తత్సమయమం దొకటన్ 119

ఆ విరిఁదోటలోన, మునుపా సఖులున్న లతాకుడుంగ సం
భావిత పుష్పశయ్య పయి, భావితుఁడొక్కఁడు భావభూ ప్రియం
భావుక చాంద్ర రోచి రభిపన్న మనోజ వికారు, ఁడేదియో
భావము నందుఁగూర్చె నమభావ విశేష విభావ్యరూపుఁడై 120

అ మ్మహామహుఁడద్భుత మంది చూడ,
నాకసపు దారి, నొక్క మహాపురుషుఁడు
చటుల ఖురము, ఁదురంగరాజంబు, ఁదెచ్చి
మ్రొక్కి, సప్రశ్రయతఁబల్కె, ముదమెసంగ 121

భూతలవాసవా! సురవిభుం డనుమోదముతోడ నంపె న
న్మాతలి, నీతురంగమ మమానుషమంబుధి సంభవంబు, నీ
కీతజీ నెంతయు న్వలయు, నియ్యెడ నీతురగంబు డస్సె, నా
రాతిరి ద్రిమ్మరు ల్మఱల రాఁగల, రెందులకైన మంచిదౌ 122

నీ పటు సాయకాహతికి నిల్వక ముద్గరుఁడట్లు పోయి, గౌ
రీపతిదత్త మద్భుత మరిప్రకర ప్రళయ ప్రదంబు దు
ష్ప్రాపము ముద్గరంబు సతతార్చితముంగొన, నాభిచారిక
వ్యాపృతి నుండె, సిద్ధిఁగనెనా? యిఁక నాతనిదే జయంబగున్ 123

తద్విఘాత మవశ్యకర్తవ్య మిపుడు,
తత్ప్రదేశజ్ఞ మీవాజి తల్లజంబు,
నీ కినుక కెదురె భువనానీక మెల్ల,
రాజమార్తాండ! యింకఁద్వరంపడవలె 124

కల్పవృక్ష ప్రసూత, మనల్ప సార
మారగింపు మిదే ఫలం బవనిపాల!
అమృతఫల, మఖిలాంగ కాప్యాయనంబు
శ్రమనిరాసక, మద్భుత శక్తిదమ్మ 125

అని, కల్పకఫల మిడి, యిం
ద్రుని సందేశమ్ముఁదెలిపి, తోడ్తో నంత
ర్థి నెనసె మాతలి, నృపతియుఁ
బని వినియెను దురగమెక్కి భాసురలీన్ 126

భూతలాధిపుఁడెక్కుటయే తడవుగ,
మారుతాతిగ జవసత్త్వ మహిత మశ్వ
మెనసెఁద్రుటిలోన, నొక్క మహీధరము గు
హాపదం బంధకార జాతాపదంబు 127

విస్తృత భూషణావళి నవీన రుచు, ల్విలస త్కిరీట ప
ర్యస్త మణిప్రభ, ల్తురగరత్న శిరోమణి రోచు, లేచినన్
ధ్వస్తములయ్యెఁదత్తిమిరవర్గములెల్ల క్షణంబులోన, ర
క్షస్తతి యస్త్రముం బొరయు సంచెఱిఁగించు విధంబుఁదోపఁగన్ 128

ఆ గుహఁజొచ్చి నంతనె, నళాధిపుఁగన్గొని, దానవ వ్రజం
బాగని కిన్కమై నొకట నార్చుచు, నైక విధాయుధావళిం
బైఁగురియించి తన్నిశిత బాణహతిం దెగి, కీలి కీలలన్
మూఁగు పతంగ సంచయముఁబోలి, సనెన్ యమమందిరాంతమున్

అమ్మల నమ్మెనం జెఱిచి నంత, వినంబడె నేవియో కఠో
రమ్ములు మంత్రతంత్రము, లరమ్మున లోపలికేఁగ హెూమ కుం
డమ్మును, ఁదత్క్రియాపరుఁడు, నష్టమనోరథుఁడాశరుండు, ఘో
రమ్ములు సైన్యము, ల్విహితరక్షణము ల్గన నయ్యె ఱేనికిన్ 130

జనవిభుం డానిశాచర సైన్యమెల్ల
శాత శరముల విచ్చ విచ్చలుగఁగొట్టె,

ద్రుతతరంబుగ వహ్ని నాహుతులు వ్రేల్చు
ముద్గరునిఁగాంచి పల్కె సముద్గత రుష 131

ఓరీ దుష్టనిశాచరాపశద! నీ యుద్యోగముం గంటి లే
రా! రారా యిఁక నెందు బోయెదవు? బాహాస్థేమ మేమయ్యె? నా
రౌరా! యెంతటి పంద, వాజి విముఖా! రక్షోగణాధీశ్వరా!
లేరా మార్కొన నస్మదీయ పటు దోర్లీలా ప్రసంగమ్ముతో 132

గెల్చుట చేఁత కాక, పిఱికీ! పలుమాయలు సేసి, యగ్నిలో
వ్రేల్చుచు నుంటివా, తెలిసె వీరువిధం, బిఁకనైన ముందటన్
నిల్చి మదీయ శాత శర నిష్ఠుర కీలల నీశరీరముం
గూల్చిన మేలగున్, విబుధకోటి హసించును, దానవాగ్రణీ! 133

మాయలింకను జెల్లవురా యనినను,
నిశ్చలత్వముగను రజనీచరేశుఁ
గాంచి, కిన్క నిలాతలాఖండలుండు
గుణము సారించి మార్గణగణముఁదొడిగె 134

ఆ నిశాటునిమేన శరాళిఁజొనిపి,
యుగ్రరీతిని హోమసామగ్రిఁజెఱిచెఁ,
జల్లనార్చెను వారుణాస్త్రంబున న్వా
తాశు, నా హతాశుండు నిరాశతఁగన 135

చెడ్డ కజ్జ మెటులొ చెడిపోయె నంచు, నా
దానవుండు కోప తప్తుఁడగుచు,
లేచి యార్చి యుగ్రలీల, నానావిధ
మాయ లెసకమెసఁగ, మాఱుకొనియె 136

ఆ యినతిలకుఁడు తత్కృత
మాయాజాలముల కెల్ల మాఱొడ్డుచు, దై
తేయుని కాయము శస్త్ర ని
కాయమ్ముల గాయపఱచె, ఁగసి యెసఁగంగన్ 137

రాక్షసుఁడదృశ్యుఁడై యంతరిక్షమెనసె,
ననుసరించెను వాని నయ్యశ్వవరము
భూవరాధిష్ఠిత, మ్మొందుఁబోయి పోయి
జీర్ణదేవాయతన మొండుఁజేరె, నంత 138

ఆ నరపాలమౌళి వెస నశ్వము డిగ్గి, ప్రదక్షిణంబునన్
లోనికి నేఁగి, కాంచెను విలోకన భీకర చండ ముండ ము
ఖ్యానయదానవప్రకరహన్త్రి నతాభయదాత్రి, దుర్గ, భ
క్త్యానతిఁగూర్చి, మౌళి ఘటితాంజలియై నుతియించె నివ్విధిన్ 139

త్రిభువనధారిణీ! త్రిదశమకుటకోటి
సంఘట్టితాంఘ్రికంజాత! నతులు
భైరవరూపిణీ! ప్రకటదంష్ట్రా ఘోర
కీలాసహస్ర సంకీర్ణ! నతులు
సర్వాయుధాంచితా! స్వర్వాసి తరుగణ
గర్వప్రహాణివిఖ్యాత! నతులు
కోటిభానుప్రభా! క్రూరాట్టహాస ధ
వళిత దిశాచక్రవాళ! నతులు
కామరూపస్వరూపా! మహామణి ప్ర
భాసితా! హస్తవిధృతకపాల! నతులు
భూత భేతాళబృందసమేత! కాళ
రాత్రి! నవరత్ననిధికోశదాత్రి! నతులు 140

టంకారమా? రోషహుంకారమే చాలుఁ
జాలి చాలని వారి నేలఁగూల్ప
న్యక్కారమా? భీషణాకారమే చాలు
భూరి రక్షః పరాభూతి సల్ప
ధిక్కారమా? సింహదృక్కారమే చాలు
సమద శాత్రవకిరీటములు డుల్ప
ధుక్కారమా? పటుధక్కారమే చాలు
రాక్షసీ తతుల గర్భము లెడల్ప
నభయ వాంఛితదాన హస్తానుకార
మా? దయాపూరపూరితాపాంగవీక్ష
ణప్రకారమే చాలు భక్తప్రకరము
నార్తులం బాపి, సంపద లమర నిల్ప 141

అనుచు నుతియించి, భక్తి నయ్యవని విభుఁడు
సాగిలంపడె నమ్మహాశక్తి, కంత
నసురుఁడేతెంచి హస్తధృతాసి యగుచు
నొడయనిం జంప, సంభ్రమోద్యుక్తుఁడయ్యె 142

ఆ యుద్యోగముఁగని, వెనుఁ
బాయని హయతల్లజంబు పటుచటుల ఖుర
స్ఫాయ చ్చంక్రమణక్రియ,
నా యసిఁదప్పించె దనుజుఁడలమట పడఁగన్ 143

అధిగత తత్ప్రకారుఁడు నరాధిపుఁడుం గసి మీఱ లేచి, య
య్యధము నురస్థలంబు నిశితాసిని వ్రయ్య, ఁబవిప్రభిన్న భూ
మిధరము మాడ్కిఁగూలె నిల, మెచ్చిరి దేవత, లాశ లుల్లస
ద్విధమునఁ దోఁచె,ఁ గల్పసుమవృష్టి యెసంగె నృపాలమౌళిపై 144

అనుమనుజాశనేశవధ మాభువనేశ్వరి సుప్రసన్నయై,
జనవిభు మేను హస్తజలజమ్మునఁదాఁకి దయారసంబు నె
క్కొన వరమొండు గోరు నృపకుంజర! యన్న, నతండుఁద్వత్పదం
బునఁ దిరమౌ ప్రపత్తినిడి ప్రోవఁ గదే యని మ్రొక్క, దేవియున్ 145

భూపా! యెవ్వఁడు మది నా
రూపంబు దలంచి మత్పురో మహి, బలిరూ
పాపాదితు దానవు నిడు,
నాపురుషుని యాన నడచు నఖిల జగమ్ముల్ 146

ఆయుధంబేది యుపయుక్తమై తనర్చు
నా సమయమందుఁదత్సిద్ధి నందు నతఁడు,
నీవెఱుఁగవైతి వైన నా నేతి నడపితి,
వంత ఫలమెనసెదవు జన్మాంతరమున 147

అనిన, మహాప్రసాదమని యంబకు మ్రొక్కి, కృతార్థుఁడౌచు, నె
మ్మనమలరంగ, భూవిభుఁడు మానిత మశ్వ వరమ్మునెక్కి, యా
త్మ నగరమున్మదిం దలఁప, ఁదతక్షణ మప్పుర గోపురాంగణ
మ్మెనసె వయస్యులు న్సచివ బృందము స్వాగతికత్వమందఁ గన్ 148

అధిక వైభవ మొప్ప రథ్యాతలమ్ము
గడచి, తగువారలం దురంగమ హితమున
కు నియమించి, సింహాసనమెనసి, రాజ్య
తంత్రములఁగని, జనియె శుద్ధాంతమునకు 149

ఇష్ట మృష్టాన్న పాన సంతుష్టితఁగని,
ప్రియతమా లలితోపచారయుతుఁడయి, మ

నం బలర నింతి కథ్వనీన ప్రకార
మెల్లఁదెలుపుచు, (గొంత ప్రొద్దెడపె నంత 150

మధురాధీశ్వన కంబికేశు కరుణ న్మాన్యుండు పుత్రుండు, ప
ద్విధయౌ కూఁతురు జన్మమంది, రిఁక రేపే యూపె దీవ్యత్కల
ప్రథితు న్రాజసుతుం బరాక్రమయుతు న్భద్రాస్థితు న్నిష్కలం
క ధృతి న్మెచ్చి వరించు, నిందుఁబణమొక్కండుండెఁదద్వేదికన్ 151

సంతతమ్మును భ్రమియించు చక్రమెక్కి,
తదుపఘట్టిత దర్పణ తలమునఁగల
బింబిముం గని, లక్ష్యశుద్ధిం బయిఁదిరు
గాడు శుకము మెడ న్నఱుకంగ వలయు 152

అనెడి చాటింపు చెవిసోఁక, జనవిభుండు
నా పతింవర రూపము నాత్మనెంచి,
తత్స్వయంవరమునకేఁగఁదలఁపు వొడముఁ,
దగిన మాటల నింతి డెందమ్ముఁదేర్చె 153

అరుసముఁగూర్చు సొమ్ము గడు నందము గందముఁజిల్కినట్టు, లీ
చెరువు నిజంబు పేరుగల చిన్న కయీసరుఁడిట్లొనర్చు చా
ల రవణ సుందరేశ్వర విలాసము నాఁదగుఁదెల్గు కబ్బమం
దరిగెను గెంపు మూఁడవది తద్దయుఁ బెద్దలుఁబెద్దసేయఁగన్



## చతుర్థాశ్వాసము

శ్రీ కరంబగు తోరణశ్రేణిఁగట్టి,
ప్రకటశోభలు వైజయన్తిక లమర్చి,
యురుయశుని యానఁగైసేసి రొప్పుగం, బు
రంధ్రు లుత్సాహమున మధురాపురమ్ము 1

పటికంపు పలకలపంచఁబచ్చలనిడి,
కాదని పద్మరాగములఁగూర్చి
మండపమ్ములకు రంభాస్తంభములఁబూన్చి,
కాదని మణిపుత్రికల నమర్చి
పందిళ్లఁజివురు జొంపపుఁబఱపులఁగని,
కాదని క్రొవ్విరిగములఁ బఱచి
సిక్తేల హిమసార సికతాంకనముఁజేసి,
కాదని సుమపరాగములఁజల్లి
యగురు చందనములఁ గలయంపిఁగొట్టి,
కాదనుచు మృగనాభిపంకమ్ముఁగలిపి
చిత్రతర శోభలం గయిసేసి, రంత
సంతసమున స్వయంవరాస్థానకమ్ము 2

పురి నలువీథులం బసిఁడి పుట్టములన్ మణిమాలికా స్వయం
వర మహితోత్సవంబనుచు మౌక్తికపంక్తుల సొంపులీన న
క్కరములు గూర్చి, పార్శ్వగత కాంచన సౌధ లసత్పతాకికో
త్కరముల కెత్తి కట్టిరి వికర్తను తేజుల దారి కడ్డుగన్ 3

రాజకుమారపాళి మణిరాజి కిరీటముల న్ధరించి, వి
భ్రాజిత గంధమాల్య విభవంబులఁబెండ్లికొమారు వేసము
ల్తేజరహింప వచ్చి, నృపతి ప్రియదత్తసభాజనక్రియా
భాజనమై సుఖాసన విభాగములం బొలిచె న్నభోన్నతిన్ 4

రాజకాంచితము స్వయంవరప్రదేశ
మెనసె నొక రాజపాకశాసనుఁడు, తార
కాచిత చరము శశధర కలిత మాక
సంబనం బొలిచెం దదాస్థాన మపుడు 5

ఆ శుభవేశమందు, మధురాధిపునాన భటుల్ సభా జనా
భ్యాశమునందుఁగూర్చిరి ప్రహర్షము మీఱ కులాల చక్రసం
కాశము చక్రము, న్నముపకల్పిత దర్పణ మొండు, దానికిం
బై శుకయంత్ర ముంచిరట బాణగణంబును జాపవల్లికన్ 6

అది భ్రమియించు చక్రము, తదాస్థితుఁడై ముకురంబుఁగాంచి, పై
నఁదిరుగు చిల్క నేకశరనష్టముఁ జేసిన వీరుఁడౌనటే,
యిదియొక లెక్కయే స్ఫురదరీనుల నొంచిన మేటివాని, కా
మదగజరాజయాన మణిమాలికకై యొనరింపఁగావలెన్ 7

అని తలఁచు చుండి రెదలోన మనుజవిభులు,
భుజబలం బెవ్వరికి వారె పొగడు కొనుచు,
నంత నేతెంచెఁజతురశ్రయాన మొండు,
పరిజనము చెంగటన్ బరాబరులొనర్ప 8

ఒక హరిణనేత్ర తద్యాన మొయ్యన డిగె
జలదతతిఁబాసి నిలుచు చంచల యనంగఁ,
జకిత చకితంబుగాఁగ రాజన్యకమ్ముఁ
గాంచి యెనసె నుచిత వేదికాతలమ్ము 9

ఉరుయశుఁడేఁగుదెంచి, యయము న్నయము న్నమయంబు నొప్ప భూ
వరసుతులం గనుంగొనుచుఁబల్కెను, రాజకుమారులార! కీ
ర్తి రమణులార! చిల్కఁదెగవ్రేయుఁడు చక్రమునెక్కి దర్పణాం
తరమున లక్ష్యముం గని, యనంతర మంచిత పుష్పదామమున్ 10

ఆతని కంఠమ్మున నిడి,
నాతనయ వరించు నన్న, నరనాథులు సం
స్ఫీతగతి నేఁగుఁదెంచియు,
వీత మనోరథతఁజనిరి విఫలక్రియులై 11

చక్రమ్ముఁదరిసియు జడిసి వోయెడి వారు,
నందుఁ గాలిడి వడి నదురు వారు,
పయి నధిష్ఠించి యూపయిఁజేతకాని వా,
రమ్ము సంధింపకే యాఁగువారు,
ముకురమ్ముఁ గని యంతటికె వీఁగువారలు,
లక్ష్యమ్మునకు నంగలార్చువారు,

నొడలెల్లఁగంపింపనోపక యుడుగు వా,
రనుమానమునఁ బూనుకొననివారు,
వేలివాసిలోన వెంట్రుకవాసిలో
నూలివాసిఁదప్పి సోలువారు,
బాహుగౌరవమ్ము వమ్ముగా నెదనెంచి
నవయు వారునైరి నృపవరులెల్ల 12

అంత నొకింత సేపటి కనంతుఁడనందగు వాఁడొకండు భూ
కాంతుడు, రాజవర్గము మొగంబుల విన్నఁదనంబుఁదోఁప, న
త్యంతము తీవి తేవయు నయంబెసఁగ, న్మదహస్తి లీల నా
చెంతకు వచ్చి, విల్లుఁగొని సింగిణి యెక్కిడి, యమ్ముఁగైకొనెన్ 13

ఆ మణిమాలి యతనిఁగని,
తా మానసమునఁదలంకె, ఁదత్పణమిష్ట
స్థేమప్రతికూలంబగు
నేమో యని యులికె, ఁజెలుల యింపునఁదేరెన్ 14

ధీరవతంసుఁడొక్కవడిఁదేకువఁజక్రమునెక్కి, దర్పణం
బారసి, బాణము న్వదలె, నమ్మణిమాలిక నెమ్మనంబు శం
కేరిత వృత్తి నందఁగ మహీపతులెల్లరు ఁబిచ్చలింపఁగం
గీరశిరమ్ము నొక్కటఁ దెగె న్మధురాధిప పుత్రి చింతతోన్ 15

అంతట నొక్క మహాత్ముఁడు
స్వాంతము సంతసముఁగూడ నరుదెంచి, మహీ
కాంతుం గవుంగిటంగొని,
యెంతయుఁబ్రియమెసఁగఁబల్కె వీద్భశసరణిన్ 16

ఎన్ని దినంబులాయెనొ సుహృద్వర! నిన్గని, సంతసమ్ము నేఁ
డెన్నఁగ శోభన మ్మహమహీనము, మీరలు బావగారలై,
రన్నఁగొఁటంత గల్గునె మహారథవర్య! పరిగ్రహింపు చం
చన్నవమాలిక న్మదనుజా వనజాత కరార్పితమ్ముగాన్ 17

అని యమ్మహితుండన, నా
ననమున దరహాసరేఖ నటియింపఁగ, నా
య్యన నరనాథుని గళమున
మణిమాల మధూక కుసుమమాలిక వైచెన్ 18

ఆ మనుజాధినాథుని మహత్త్వమునోర్వక, తత్సమాగతుల్
భూమివిభుల్ దురంతమదమోహితులై, నిఖిలాస్త్రశస్త్ర వి
ద్యామిత పాండితిం గదిసి రాతని నొక్కట మిక్కుటంబుగా,
హేమమహీధరంబుపయి కేగెడు నబ్దకదంబమో యనన్ 19

సమర సముత్సుకుండగు విశాంపతిఁ గాంచి, వయస్యుఁడింతకే
శ్రమపడనేల మీరలని, చయ్యనఁ గార్ముక మెక్కువెట్టి, బా
ణముల జడిన్ విపక్షనరనాథుల నేపఱ ముంచె, నంతఁద
త్ప్రమద మహంబున న్వలయు తత్కరణీయము లెల్లఁ గూర్చుచున్

ఉరుయశుఁడొసంగె నా జన
వరునకుఁ దనుజాత నధిక వైభవమున, నీ
శ్వరునకు సుమఁ బ్రతిపాదిం
చ రసాధరసార్వభౌము చొప్పెసఁగంగన్ 21

ఇంపుఁ బెంప వధూవర మేకపీఠ
మధివసించి ప్రకాశించె నంచితముగ,
నవిద తలమానికము లాజహోమధూమ
భవ్యపరిమళ మెనసె సప్రశ్రయముగ 22

ఇల్లలి నా వివాహము మహీమహనీయ విధంబునం బ్రకా
శిల్లె, ననంతరంబు రిపు జిత్వరసైనికకోటులన్, మదో
త్ఫుల్ల కటంబులన్ గజసమూహముల, న్మధురాధినాథుఁడా
యల్లున కింపెసంగ నుపహార మొసంగెను బ్రీతచేతుఁడై 23

అంగనలా నవోఢకు నయం బెసఁగ, న్నవగంధ తైల మ
భ్యంగముఁ గూర్చియుం, పసపు నద్దిన లొద్దుగ పిండిఁ బూసి, గొ
జ్జంగుల నిప్పపూ సొనల జారిన గందపు తేటనీట సా
రంగదళేక్షణన్ జలకమార్చిరి, యింపగు పల్కులాడుచున్ 24

సహిమ చందన రస సలిల సుస్నాతయై
యెసకమెసఁగె మివుల నింతి మిన్న,
చాలి మదనదేవసామ్రాజ్యరాజ్ఞీ ప
దాభిషిక్తయౌ తదంగన యన 25

మృదుకరంబుల నా సుమమృద్వి కైశ్య
మొత్తి, యగురుధూపమ్మిడి, రువిద లతివ

నెతికులుల కోడి సంసేవ నెఱపు మొగిళు
లనఁగఁదద్దామ పటలిక లతిశయించె 26

చెలి యోర్తు జిల్గుపావడఁగట్టి యొకగట్టి
ముడివైచి, సాకూతముగఁ గనుఁగొనెఁ,
జాన యోర్తుక వల్ల చనుదోయిఁదగు తైక
బిగియించి, సస్మితమ్ముగఁబనివినె,
నంగన యొకతె కనుంగవఁగజ్జలం
బిడి, సహేలముగ నేమేమొ గొణఁగె,
నతివ యొక్కర్తుక యడుగుల లాక్షార
సముఁగూర్చి, చెవి రహస్యమ్ముఁజెప్పె,
మంజువాణి యొకతె మానవతికి మించు
గంద మలఁది, పైనఁజిందె, నొక్క
కలికి తిలకమిడియెఁగమ్మకస్తురిఁదెచ్చి
రంగరించి స్మితము చెంగలింప 27

ఆయమ రూపధేయమును హావములం గని మెచ్చువారు, నీ
చాయలు గల్గనే సురల చానలకైన నటంచుఁబల్కువా,
రాయెడ నాత్మల న్వివశలై మెయిఁజొక్కెడివారు, ఁజిత్ర రే
ఖాయిత వర్తనం బెనయఁగా నయిరా నృపసూతి నెచ్చెలుల్ 28

సతి జనయిత్రి మద్రసుత చంపకమాలిని యేఁగుదెంచి, యా
సుతను గవుంగిటం బొదివి, చొక్కుచుఁజెక్కిలి ముద్దుఁగొంచు, శీ
ర్షతలము మూరుకొంచు, నుపసాంత్వనముం బొనరించి, యిట్లనెం
గుతుకము సంతసమ్ము వెలఁగు న్వినయమ్మును బత్తి హత్తగన్ 29

శ్రీలలనా మతల్లిక విశేష సమర్చిత యస్మదీయ భా
గ్యాలి ఫలింపనైన నయనాతిథితం గనె నొక్కనాఁడు మా
పాలిట కల్పవల్లిక కృపాలహరు ల్దయివాలు, నానమ
న్మోళుల మమ్ముఁగన్గొని సమంజస మిష్టవరం బిడెం, జనెన్ 30

మా యిష్టము నెఱవేఱ, శు
భాయతి యెసలారఁదోఁచె నాత్మజయై నా
రాయణు దేవేరి దయా
శ్రీయని తగ నామధేయమిడినా మనఘా 31

ఇటులుండగ నొకనాఁడు, వి
ఘటితమ్మగు దైవకలనఁగావలయు, ఁదప
శ్చటులుఁడు రైభ్యుఁడు వచ్చెను
నిటలాంజలి యురుయశుం డనింద్యతఁగొనఁగన్ 32

ఎందులకుఁ గృద్ధుఁడయ్యెనో యెఱుఁగరా
యెఱిఁగినను మాఱునే నియతీరితమ్ము,
శాప మిడియెఁగఠోర మా తాపసుండు
మీ తనయ మీకుఁగాకుండు గాత మనుచు 33

మఱు నిముసమందె యంతః
పుర మెల్లను సిరి దొఱంగె, ఁబూఁబోణీ! మా
పురపుర యేమని సెప్పుదు
నరిగణములకైన వలవ దావెతలెల్లన్ 34

మంత్రి నిక్షిప్త బహురాజ్యతంత్రుఁడగుచు
నోజ దక్కి వనంబందె మీజనకుఁడు,
నేను నాతని వెనువెంటనే నడచితి
మహిత మౌనివరేణ్యాశ్రమతలములను 35

ఒక పుణ్యాశ్రమ భూమిభాగమున, నిష్ఠోపాత్తవృత్తిన్ శరీ
రకృతిం జేయుచునున్న, నన్నలిననేత్రావామదేహుండు స
త్త్యకృతస్ఫూర్తినిఁదోఁచె స్వప్నమున, నంత న్మేలుకోలంది నా,
మకలంకామృతసూమరీచి సుష మోద్యద్గర్వ జైత్రాననా! 36

మేలుంగంటిమి, మేలుకొంటి, మిఁక మేల్మేలంచు మేలెంచుచుం
బ్రాలేయాంశుధరుం దలంచి, యుటజ ప్రాగ్భాగసీమ, న్శిశు
క్రీడాఖేలన లోలు బాలకుని భోగిస్ఫార దీవ్యత్ఫణా
జాలాశంసిత శోభనుం గని, సుఖాసారంబునం దేలుచున్ 37

బాలకునిం గైకొని ము
ద్దాడి గిరీశ ప్రసాదదత్తుండని స
ల్లాలనలం బెంచితి, మో
లీలావతి! బంధుతతి బళీ! యని మెచ్చన్ 38

ఆరహిఁగొంతకాలము ప్రహర్షమునం జన, వామదేవు దే
వేరి వసంతమంగళ నివిష్టమహంబులఁగొల్చుచున్న మా

మేరకు నేఁగుదెంచి, నయమేదురుఁడై తగి దేవళంబు పూ
జారి యొకం డొసంగెను సుసంగతమౌ నొక రత్నమాలికన్ 39

ఇట్లని విన్నవించెను, మహీశ్వర! నిన్నటినాఁడు ప్రత్యహం
బట్ల, నగాధిరాజతనయాలయసీమకు నేఁగుదెంచి, ఆ
కట్ల పయిన్ ధగద్ధగధగప్రభల న్వెలుగొందఁగంటి, నా
పట్లన నీదృశంబును శుభంగమ మీ రతనాలహారమున్ 40

కైకొని, నోములెంచి మనకష్టము లెల్ల ఫలించె నంచు, దో
షాకలితుండనై స్వనిలయంబునకుం జని, షోడశోపచ
ర్యాకృతుల న్నమస్కృతుల నర్చనఁగూర్చితి, దేవ! యంతలో
నాకసమందుఁదోఁచె నిటు లబ్బురపుం బలుకు ల్గభీరతన్ 41

నీకు వలదయ్య యిది ధరణీసురాగ్ర
ణీ!, యొసంగుము మధురాధినేత కురుయ
శునకు రేపకడ యటంచు, శూరవర్య!
సకల శుభదము దేవీప్రసాద మిదియ 42

అను భూదేవునకు, న్నవజ్జనకుఁడత్యంత ప్రమోదమ్ము న
న్దనము న్ధాన్యముఁగూర్చ మంత్రులకు నానన్వెట్టి, యమ్మేటిదౌ
మణిమాలన్ గిరిజాప్రసాదమని సమ్మానించి, నాచేతులం
దునిచెన్ జాత! యదేమి యక్కజమొ యేమో మత్కరస్పృష్టమై 43

శ్రీలలితంబగు నామణి
మాలిక బాలాత్వ మెనసె, మది ముద మెనసెన్,
బాలకుఁబేరిడితిమి మణి
మాలిక యన, నదియ నీవు మంజులవాణీ! 44

మొదలిటి నుండి నీదు పొరపొచ్చెము లేని విధంబు సూడ, నీ
సుదతి పయోజనాభు నెదసోయగ మీనెడి చాన యన్య గా
దిది యని తండ్రిగారనఁగ, నేనును సంతస మందుదాన నె
మ్మది, నియతి ప్రవాహ నియమ క్రమ చంక్రమణంబు నెంచుచున్

ఓ వనజాక్షి! సార్థకత నొందెను పుట్టువు, వేయునేల, మా
జీవితము ల్తరించెఁ గల సేమము లెల్లను సేకుఱె, న్మహేం
ద్రావరజాత తుల్యవిభవాన్వితుఁడౌ ప్రియరూపమేదినీ
దేవవిభుండు, నల్లుఁడయి దెచ్చెను మాకుఁబ్రతిష్ఠ నింపుగన్ 46

నేరములేవి లేవుగద నీయెడ, నున్న క్షమింపు, మైన మా
నేరమి నెంతువొక్కొ, జననీ! యెడ యెంత దయాప్లుతమ్మొ, బం
గారపుమూటవమ్మ! మృషగాదిది, వంగడమే తరించె, మా
గోరములెల్లఁబాసె, నినుఁగూరిమిఁబెంచిన మంచి నోమునన్ 47

అని సప్రశ్రయ సాను సాన్త్వన ససౌహార్దమ్ముగాఁబల్కి, యా
జనయిత్రీమణి కూఁతు ముద్దుగొన, నాసాధ్వీవతంసంబు వా
సి నమస్కారముఁగూర్చ, నామె తగ నాశీర్వాదము ల్సల్పి, యేఁ
గె నిజాంతఃపుర రమ్యహర్మ్యమునకుం గ్రీడావతు ల్గొల్వగన్ 48

మణిమాల, నిజాకృతి ద
ర్పణతలమునఁగాంచి, యబ్బురంబున నిష్పం
ద నయన యయ్యెను, దక్కిన
జనముల పనియేమి? యంత సఖు లాసతితోన్ 49

మీ యమ్మ చెప్పవింటిమి
మా యమ్మ! చరిత్రమెల్ల, మానవతీ! మా
కే యెడల లోటు లే, దిఁక
మాయాశయములు ఫలించె, మర్మముఁదెలిసెన్ 50

ఐననొక్క కొఱంత మాలోనఁగలదు,
తల్లి క్షమియింపు మమ్మ మా తప్పులెల్ల,
నెపుడేమంటిమో నిన్ను నెకసకెముల
నన్న చెలులకుఁబల్కె నొయ్యారి యిట్లు 51

ప్రాణంబులకుం బ్రాణము
గా నడచిరి గాదె, తప్పుఁగల్గునొకో మీ
లో నెచ్చెలులారా! మన
యీనెయ్యము శాశ్వతమని యింపుగఁబలికెన్ 52

అంతట నావయస్యలు జనాంతికమాడి వచించి, రమ్మ! మా
కింతయుఁ దెల్పు మప్డు వచియించిన గాథకు శేషమన్న, నా
యింతియు నవ్వటాలకటులేదియొ సెప్పితి నన్న, ఁగాదు కా
దంతియ మా మనంబు కుతుకాన్విత మిప్డది దెల్పు నావుడున్ 53

దరహాసరేఖ మోమున
సిరిఁబెంపగఁబల్కె నా విశేషజ్ఞ, మనో

హరమగు ఫణితిం గైకొని
కరిరాడ్గతులార! యింపుఁగల్గిన వినుఁడీ 54

ఇంపు గల్గదు తమ్ముని యెడ, నుపవన
విహరణమ్మున డెందము వేడ్క గనద,
యేదియుంగోర, డెందులకేనిఁబోదు,
నవ విరహబాధ నాధిషణాకుమారి 55

అనుకూలాలాపన యౌ
పనిషదియను చెలియ నెనసె భావిని, తద్భా
షణముల నెఱింగె నిష్పం
దుని యున్నత గాథ లాత్మ తోషము నందన్ 56

ఆప్తకాముఁడభిన్నుఁడా యధిపుకన్న,
నా యనింద్యుఁడు స్వరసున కన్న వేఱు
గాద, యున్న తత్త్వంబది, కలికి! యాప్త
కాముఁడిది యెఱింగిన నిజకలనఁగాంచు 57

అను నెచ్చెలి పలుకు విని, ధి
షణ తన తమ్మునకుఁదత్త్వసారము నెల్లన్
వినిచె, వెస నాప్తకామున
కను బోధింపంగఁబంపె, నా పయి నతఁడున్ 58

ఉన్నవాఁడున్నయట్టు లాయొప్పు నరసె,
నరసె యేమయ్యెనో యరయంగ రాదు,
సతియు నిష్పంద సామరస్యమ్ము మరగె
లోకమెల్లను లేమిలో నేకమయ్యె 59

స్వరసుఁడననయ్యె నంత నిష్పందు, ఁడింత
సేయ నంతయు నమ్మయి వోయెనంచు
యామె కుమిలి కృశించి యయ్యధిపుఁగలసె,
నొండు లేదింక స్వరసు ఁడొక్కండు దక్క 60

అద్వయ స్వరసానుభావాత్త మహిత
వైభవోదిత సత్య నిష్పంద నిత్య
సన్మహోజ్వలతానంద సార రస ప
రమ సుఖానుభవైకతా రమ్యమయ్యె 61

అని, యీకత ముగియించిన
వనజాక్షినిఁగాంచి, చెలు లవారిత ముదమొ
ప్ప నవోఢా! నీవును ద
త్రృణయినివేగా యటంచు, ఁబకపక నగినన్ 62

లీలావతీలలామ త్ర
పా లాలిత్యమున మోము వంచి, యొహో! చా
ల్చాలును బో పొమ్మంచు
న్లీలాకమలమున ఁదాఁచె నెచ్చెలి నలకన్ 63

అని యీలాగున నింపు పుట్టగ, మృదువ్యాహార మొప్ప న్సఖీ
జనముల్ నూతన నాథ సంగమవిలాసన్యస్త వేషాన్వితన్
మణిమాలం, దగఁదత్తదిందు పవమానశ్రీలస న్మంజరీ
వనితానన్యజ సౌకుమార్యముల నొప్పం, జెప్పు చున్నంతలోన్ 64

రహిమించు నెలవులు, రతనాల తిన్నెలు,
సిరిఁబెంచు సాలభంజికల గములుఁ
బటికంపు బొమ్మలు, చటుల ప్రకాశముల్,
హరువులీనెడి క్రొత్తవిరుల పాన్పు,
లగరుధూపమ్ములు, నభిమత వస్తువు,
లవిలి వొల్చెడి యత్తరువుల, తావు
లెలయు హారంబులు నిలువుటద్దమ్ములుఁ,
దీయని మేలి పానీయములును,
బునుఁగు జవ్వాది గుబులు, తాంబూలపేటి
కలును, సొంపగు చిత్తరువులు, ననేక
నూతనానూన శోభనోపేత విధులు,
కలిమి నించెడి కౌతుకాగారసీమ 65

మలయ పవమానకాంకురముల మెలపునఁ
బరిఢవిల్లు వాతాయనోపాంతములఁ,
గ్రొత్త హొంబట్టు పఱపుల మెత్త నెసఁగు
నమృతకర కాన్త రత్నమయాసనమున 66

దివ్యభూషణ రోచులఁదేలువాఁడు
చాలి వెలిఁగెడి రాజసం బేలువాఁడు

శోభనపుఁబెండ్లికొమరుని చొప్పువాఁడు
చెన్ను మీఱఁగ నొక్క ఁడాసీనుఁడయ్యె 67

తలఁచు నెమ్మది నేదియో, తలఁకి చూచు
నల్దెసలు, బిట్టు నిట్టూర్పునం గలంగు,
గొణిఁగికొనె, ఁదొంగిచూచె, గగ్గోలు వడియె,
నంచితుండంత నీరీతి నెంచసాగె 68

ఆలోలాలక రాక కింత తడవేలా? యెంచనౌ వేళ న
బ్బాలారత్నము నాయెడంగల మనోభావం బెఱుంగంగ నీ
లీల న్వేడుక సేయునా?, తలఁప నాళీకాస్త్రదేవుండు త
ద్రోలంబావళి శింజినిం గలిపెఁదోడ్తో నిక్షుకోదండమున్ 69

దేవా! సూనశరాసనా! మమత లేదే నాపయి న్నీకు, నీ
ప్రావీణ్యంబున నింత గంటిని గదా భద్రంబు, లా తూపురా
జీవాక్షీమణివైపు జూపు, మది నాసేమమ్ము తద్వైఖరుల్
చేవంగూర్చును నీదు రూపమునకుం, జేతోభవ ప్రాభవా! 70

ఓ యమృతప్రసూతి కిరణోత్కర! మారహరోత్తమాంగ భూ
షాయితవేష! నిన్ను నగఁజాలెడి నవ్వు మొగంబు పొల్చు ప
ద్మాయతనేత్ర నేను హృదయంబున నూనితినంచు నేమొ నా
కాయము కుంద వెన్నెలలు గాసెద, వీపని నీకు ఁజెల్లునే? 71

మలయ పవమాన బాల! సన్మాన్యవర్త
నా! యొగిం దెల్పు మీమైన నావిధంబు,
నీ హుమాయి కనుంగవ నెఱిఁగఱపెడు
చూపుకోపుల విలసిల్లు సుదతికిఁదగ 72

ఆ యనఘుఁడిట్టు లొగిఁదలపోయు చుండి
కాంచెఁదత్ప్రౌఢ పర్యంత కాననమునఁ,
జెలుల మెలపున ఁదనపయి వలపున ఁదగు
చెలువుతో వచ్చు నాపరసీరుహాక్షి 73

కాంచి యేమియు నెఱుఁగని కరణిఁదోప,
నామహామహుఁడుచిత పర్యంక మెనసె,
నింపుఁగుల్కెడిపల్కుల నింపు చెలుల
బలిమి సుదతి ప్రతీహారభాగ మెనసె 74

తద్గృహదేహళీ నిభృతఁదన్వ్రీఁద్రపాభర నమ్రమౌళి యో
షిద్గణ మెల్ల నల్లన నొసే నినుగాంచెను రాజుగారు చం
చద్గతి రమ్మటంచుఁగెలసంబునఁజేర్చెను గేలువట్టి, భూ
భృద్గణమౌళిపాదతలపీఠము నొయ్యన మేలమాడుచున్ 75

బాలారత్నము రుంద్ర
వ్రీడా గూఢేక్షణముల విభునిం గనుచున్,
జేడియల బలిమిచే వలె
నాలలితుని దరిసె మదను నస్త్రమ వోలెన్ 76

శృంగారవిభుఁడు నేర్పుగ,
నంగన కెంగేలు వట్టి, యనుగత తత్త
ద్భృంగీ సంగత రంగద
పాంగమ్ముల సొంపుఁగనుచు నంకము సేర్చెన్ 77

పోకలాకులును గర్పూరంపు బాగాలు,
నిమ్మని యిప్పించి రింతిచేతఁ
బాదసంవాహనంబాదృతిఁగొనుమంచుఁ,
నడుగుల నొత్తించి రతివచేతఁ
పతివినంగోరె నీపాట పాడుమటంచుఁ,
బాడించి రొయ్యనఁబడతిచేత
సప్త తంత్రిక మీటఁజాలుదువే యంచు,
వీణె మీటించిరి వెలఁదిచేత
నింతిరాగమ్మొకో, యిది యెమ్మెకాని
రాగమో యంచుఁగొసరి, బిరాన యిద్ది
యుభయగతము, రసాభాస మొదవ దనుచు
నవ్వి నవ్వించి రాచెలు ల్నాతి చేత 78

ఇది సుకుమారి కెంజివురు నేనియు గోటను గిల్లలేద, యొ
ప్పిదమగు మందమారుతము పెల్లున కోపదు, చంచలాక్షి యా
మదనుని కగ్గమై ధృతియు మానె నినుం గనునాట నుండి నె
మ్మదిని గ్రహింపుమా, తలఁపుమా, చెలిమాటల, మానవేశ్వరా! 79

పాటల గంధి, నీదు పటు బాహువుల న్హృదయోపగూహ మె
ప్పాట సహింప నేర్చును? నృపా! తలపోయుము మా వచస్సు ల

చ్చోట, దరస్మితంబులకె పోలును మాచెలి, తావిమోవి నీ
గాటముగా నొనర్చు కసిగాటుల కోపదు, మేలు నెంచుమీ 80

చిన్ననాట నుండి చెలిమి చేసితి మిప్పు
డప్పగించితిమి కృశాంగి నీకు
దిగులు సెందకుండ (దగు మన్ననల(గూర్చి
యింపు(బెంచి, కొమ్మనేలు కొమ్మ 81

ఓ యమ్మా! దల(తువె మము,
మీయాయన తోడ(గూడి మేలము గొనవొ
చాయ నటంచు, న్నెచ్చెలు
లాయాపలుకులను బలుకు చనువు ఘటింపన్ 82

మఱచితి నేదియో మఱల( దెచ్చెద నంచు
మగిడి వోయె నొక కుంభప్రథకుచ,
మానినీ! నీవేమి మఱచినావే యని,
ప్రథమ వెన్నడె నొక పక్ష్మలాక్షి
యేమియు మఱువ లేదే రావె నీవంచు(,
దల(గి వోయె నొక సుధాకరాస్య
పిలిచితివా! యిదె వేగ వత్తు నటంచు
నచటు వాసె నొక యహార్యజఘన
పోవు, వారల(బిల్వ (బోవునట్లు
పోయి యటె పోయె నొక విరిబోణి, యింక
నాలుమగలకు మధ్య నేనేల నొక్క
దాననని యే(గె నొక చెలి తలుపు లాగి 83

చెలి! యిదె నేనవత్తునని చెల్వుని చేయి వదల్చ(బోవ, నా
లలితు(డు పోదువేని నవలా! యి(క నాపయినాన యంచు, (గౌ(
గిలి(గొన, సంభ్రమించె, (బులకించె, సుఖించెను, మోమువంచె, సి
గ్గిలె, విభు నెమ్మనమ్ము(గఱగించె, మనోజ్ఞవిలాసచేష్టలన్ 84

మరు(డు, మృగలాంఛనుండు, మారుతుండు,
మున్నుగా(గల మావార, లున్నతు(డగు
రాజు మిథునాయనితు(డయి రాణ(గొన్న
సౌఖ్యమెస(గె సుఖక్షేత్రసంస్థ కలిమి 85

మరునకు రూపంబిడు చి
త్తరువుల(గలతెఱ(గు లెల్ల (దన్వి వినుచుచున్,
మురిపించు మాటలాడుచు,
సరసుం డాముగుద నెలమి శయ్యకు(దార్చెన్ 86

ఎద సరంబుల (జిక్కు లెడలించు లలి, (జెలి
కుచకుంభముల (గొనగోట(జెనకు(,
బలుకు కుల్కామృతమ్ము(జిలుకు నటంచు, వా
ల్గంటి వాతెఱ మొనపంట నొక్కు,
బడలితివేమొ చంపకగంధి యని, సతి
కూరు సంవాహనం బొనర(జేయు,
గిలిగింత లిడుమాడ్కి(జెలరేగి, యింపన
భావిని నీవికాబంధ మంటు,
నారు సొరును, మేలి యొయ్యారములును,
మించు మెలపులు, మది(గఱగించు హొయలు,
చిన్ననవ్వులు, వలదన్న సన్న, లెచ్చు
వలపులుం గాంచి, ముదమందు (బార్థివుండు 87

బిగిగౌ(గిలింతల కెగయ నేరదు గాని,
యెత్తుల కెదురెత్తు లీయ(బోవు,
నధిపు నాననము ముద్దాడ నేరదుగాని,
తీయనిమోవి యందింప(బోవు(,
గుచకుంభముల బిట్టు (గుమ్మ నేరదుగాని,
(ప్రాణనాథుని యెద నలమ(బోవు(,
బతికింపు(గూర్పు(బై బడ(గ నేరదుగాని,
చెల(గు చెయ్యులను సూచింప(బోవు,
నీవినడ్డకుండ నిలువ నేఱదుగాని,
సుభగు కృతికి ననువు(జూప(బోవు,
నెలయు వాంఛలకును తలమున్కలగు సిగ్గు
నకును నడిమి నలిగి, నలిననేత్ర 88

పతిగాఢతర పరిష్వంగ మిచ్చెనొ లేదొ
సతి తనువెల్ల నిస్తంద్రత (గనె,
నృపు(డు కెమ్మోవి దేనెల నానెనోలేదొ

యింతి వాతెఱ పొంక మినుమడించె,
నిముఁడు వల్దనుంగవ నలమెనోలేదొ
రమణికిం బులకాంకురము లెసంగె,
జెలువుండు సొగసు పొక్కిలినంటెనోలేదొ
నలినాక్షి నీవి బంధంబు సడలె,
సడలెనోలేదొ సిగ్గు నిష్పంద మయ్యె,
నయ్యెనోలేదొ కనుమూత లందమందె,
నందెనోలేదొ పారవశ్యమ్ముఁజెందె,
నవసమాగమవేళ నాచివురుబోఁడి 89

కౌఁగిలింతల హంగు, కడుసన్నపు టెలుంగు,
లలిఁగ్రమ్ము చిఱుచెమ్మటల సొబంగు,
వెడలు నూర్పులకంపు సడలు కీల్ముడి సొంపు,
తావి చెంగావి నున్మోవి యింపు,
చెలఁగు నవ్వులవంతు, చిన్నదెబ్బల వంతు,
కొమరుమీఱెడి విలాసముల సంతు,
కొనగోటఁ గొనకందు, మణితంబుల పసందు,
రాయిడి కురలు హారముల పొందు,
వద్దు వద్దన్న సద్దు, పెన్మద్దు పద్దు,
మదిఁ గదురుమించు, నెడనెడఁ బొదలు సంచు
నెనరు తగుచాయ సుమశరాసనుఁడు జేయ
నమరెను గరంబు, నవసమాగమము డంబు 90

అమితవ్రీడ, వలత్కటాక్షగతి గాఢాలింగనావిర్భవ
ద్వివిముఖత్వం, బనుమోద మేదురతర స్వేదార్ద్ర గండాంత ము
త్కమనోభావ లసద్దరస్మిత కళాతంబై నవోఢా సమా
గమ, మాతేనికి నింపుఁ బెంచె, నెదఁగాంక్ష ల్నించె నెయ్యంబునన్ 91

మించు తమి, నా కృశోదరి మీఱి సిగ్గు
వెనుకఁడుచుండఁ బున్నాగమునకుఁ బ్రాకు
మాధవీలత యనఁగ, నమ్మానవీయుఁ
డెంద మలరించె మగచెయ్వు లంద మంద 92

విరిసరమ్ముల తోడ వీడి క్రొమ్ముడి యూడ,
నెఱివేణి కటిసీమ నిలిచి యాడఁ,

గుండలప్రభ చెంపలం దాలు వెలయింప,
ఘర్మాంబువులుఁ బులకలు రహింపఁ,
గమ్మకస్తురి భంగకమ్ములు ప్రిదులంగ,
వలుదచన్నుల హారము లెగయంగ,
సోగకన్నులజాలు సుభగుపైఁబడి సోల,
బిట్టు నిట్టూరుపు ల్వెంపు దేల,
రాగ మతిశయ మందఁ, జిర్ణగవుఁ జిందఁ,
గంకణమ్ములు మ్రోయ, నుత్కంఠ జేయ,
పుష్పకోదండు రాణి నా బూవుబోణి
ధవునిఁ గఱగించె బురుషాయితముల మించి 93

మెఱుఁగు చన్గుబ్బల యొఱపు కాంతులు మీఱి,
సొంపు నింపఁగఁ గౌఁగిలింప నేర్చెఁ,
దమ్మలమ్మల మేలి కమ్మతావి గుబుల్కొన,
మొనపంటిఁ బతిమోవి మోపనేర్చెఁ,
గమ్ర కంకణ ఝణత్కారమ్ము లెసగంగ,
మృదు చపేటము లిచ్చు రీతి నేర్చెఁ,
బ్రాణనాథుని డెంద మానంద మెనయంగ ,
బహుళ పుంభావ బంధముల నేర్చె,
లలిత కలకంఠకుల కంఠకలన గెలుచు
మణిత కల కాకలీరవ మహిమ నేర్చె,
నూపురంబులు మొరయఁ బెన్డొడలు నదర,
సారసాయతనేత్ర పైసరము నేర్చె 94

ఈ రీతి, నభిమత వ్యా
పారంబుల సౌఖ్య పారవశ్య మెనసి, యా
నారియుఁబురుషుఁడు సుఖ ని
ద్రారసమునఁదనిసి, రుచితమగు మెయి మెయితోన్ 95

అంత, ద్విజరాజు యామినీకాంతఁగూడి,
నెమ్మిఁజరియించి, చరియించి, నిద్రఁగూరి,
యొఱగెనో యన, (బశ్చిమాశోపకంఠ
తలినిఁగనుపట్టె రశ్మిసంతతి నశింప, 96

ప్రకట వకుళ సుమామోద పరిచయములు,
లాలిత లవంగవల్లరీ జాలకములు,
తత పునారతి ఘర్మాంబు తస్కరమ్ము,
లలరె నప్పుడు ప్రాత్యూహికానిలములు 97

మేలుకని, డెంద మిగురొత్త మెల్లన పతి
నిద్ర సెడకుండ (గన్గొని నిభృత గతి(ద
దాననము ముద్దుగొని పులకాంకములకు
సిగ్గిలు నవోఢల న్విభు ల్సెల(గి కొనిరి 98

బిగికవుంగిట(బొదివెడి ప్రియుల బాహు
బంధ మెడలించుకొని, మందభావ మెనయు
గతుల, నర్థవలిత దృష్టి(గనుచు (గౌతు
కాలయము దాటిరి నవోఢ లప్పుడపుడె 99

ఆ మణిమాలయుం, బ్రియుని యక్కున(జిక్కి, యెటో తలంగి, ని
స్సీమ మనోజసంగరముచే, నయథాతథమైన సన్మణీ
దామగణంబు, (బ్రావిరుల దండలు, (బయ్యెద(జక్క(జేసి, దృ
క్సీమల నాత్మనాథు(బరికింపుచు, నా నిలయంబు వాయుచున్ 100

అరుసము(గూర్చు సొమ్ము గడు నందము గందము(జిల్కినట్టు, లీ
చెరువు నిజంబు పేరుగల చిన్న కయీసరు(డిట్లొనర్చు చా
ల రవణ సుందరేశ్వర విలాసము నా(దగు(దెల్గు కబ్బమం
దరిగెను గెంపు నాల్గవది తద్దయు( బెద్దలు(బెద్దసేయ(గన్ 101



# పంచమాశ్వాసము

రాజహంసత్రోటి రమ్యక్షతిం బొల్చు
కోశయుగ్మముఁదాల్చెఁగుముదవల్లి,
పుంస్కోకిలా స్వాదమున నెసంగు కిసాల
కముఁ బూనె నిదె సహకారవల్లి,
పున్నాగమునకయి కొదలి పెనఁగులాడి
సొలసిపోయెను స్మరాశోకవల్లి,
పవమాన సంగతిఁబడయ ననల్పేడి
పొంకము నిడె నతిముక్త లతకు,
ననుచు నొకచోట గుమిగూడి, యనుఁగు చెలులు
పలుక విని, చంచలాక్షి త్రపాభరమున,
నాననము వంచి, మెల్లఁగ నడుగులిడుచుఁ,
జేరె నవ్వారిఁగ్రొంక్రొత్తసిరి యెసంగ 1

రాజవతంసుఁడంతట, బిరానఁదదోచిత కృత్యమెల్ల న
య్యోజను దీర్చి, యర్యమునకు న్నతి సన్నుతి నింపుఁగూర్చి యా
రాజకళాకిరీటునిఁబరంబగు బత్తి యజించి, యుల్లస
త్తేజము మీఱ నుండ, నొక దివ్య విభావుఁడు వచ్చి యర్మిలిన్ 2

బావగారికి నేఁటి ప్రభాత మెన్న
శోభనమె? సుఖనిద్రయే? శుభమె? యనుచుఁ
బలుకరింపుచు, మదికి నింపెలయ, ఁజెంతఁ
జేరి, యిట్లనియెను సుఖాసీనుఁడగుచు 3

మా నగరంబునఁ గల యు
ద్యానంబుల సొబగుఁగంటివా? నీవో బా
వా! నెమ్మదిఁబ్రియ మొదవెడు
నేని, న్వెస రమ్ము తద్వనీందిరఁగనఁగన్ 4

అనిన, నట్లకాక యని ప్రియరూపుండు
బావగారి బుజము వట్టి, లేచి
యతఁడుఁగొలిచిరా, వయాళికి వెడలెను
బారశీకములగు వారువముల 5

ఆ పుర రామణీయకము, హర్మ్యగణంబుల పొందు చందమున్,
గోపుర తోరణంబుల వినూత్న విధంబులు, వైజయంతికా
ప్రాపిత శోభలుం, గుముద బంధు శిలా ఘటితా ధిసౌధముల్,
భూపతిమౌళి కాంచి, కరము న్మొద మబ్బుర మందె నెమ్మదిన్ 6

ఆ నరపాలవర్యుఁడు ప్రియాలపనుండగు బావగారితో
మానిత తత్పురంబు మహిమం దగ ముచ్చటలాడుచు న్జనం
గా, నతిమాత్ర విస్మయ వికస్వరులై కని, యెల్లవారు తా
మానససీమ వారి గరిమంబును మెచ్చి రదో విధంబుగాన్ 7

వీరలలో నీతఁడు మన
భూరమణుని నందనుండు, పోలికఁగనమే?
యీ రాజీవవిలోచనుఁ
డా రాజున కల్లు, ఁడతి బలాఢ్యుఁడు నెందున్ 8

వీరి రూపు కన్నులారఁగాంచిన వారి
మదికిఁదోఁచు నధిక మహిమఁగన్న
ధీరవర్యులు నరనారాయణుల రూపు,
కానఁబడిరి సుకృత కలన మనకు 9

అను పౌరజనులఁగాంచుచు,
ననుమోదము మీఱ, సముచితాలాపములన్
మనముఱ, బావయు మఱఁదియు
ననితర శోభములఁగాంచి రంచిత వనముల్ 10

ఆ వనసీమలం దతిశయంబుగ మెచ్చగు చోటులెల్ల నా
బావమఱందు లెంచుచు, నభంగుర మందసమీరణ ప్రియం
భావుక మంజరీ నిచయ భాసుర బాలరసాల మూల సం
భావిత చంద్రకాంతశిలపై, ఁబ్రియమొప్ప సుఖోపవిష్టులై 11

ఏవియేవొ ప్రసంగంబు లిచ్చఁగూర్చి
యెకచకలు, ఁబరిహాసంబు, లెసకమెసఁగ,
మందహాస ప్రకాశము లందమొప్పఁ
బలికి రారీతి వారి భావమునకె తగ 12

ఇందగు సందర్భమునకుఁ
జందం బెటు గూర్చితయ్య? సర్వేశ్వర! నీ

సందర్భమ్మునకుం దగు
పొందెవ్వం డెఱుఁగునయ్య? పూరుషవర్యా! 13

పతి యలిగినచో సతియును,
సతి యలిగినఁబతియు గలసి చనవలె, నిన! నీ
మత మదియే న్మతిసెడెనో,
గతిసెడెనో, దెలుపుమయ్య కమలదళాక్షా 14

కలదానికిఁగలదానికిఁ
గలుగవె భేదమ్ము? లధిప! కలకలదానిం
గలదానిఁదలఁచి వలచిన
కలిమికి నీవేమి చెప్పఁగలవొ నుడువుమీ 15

దివ్యానుభూతి నెంచుచు,
భవ్యాశయు లీవిధమునఁబలుక, దశాశాం
తవ్యాపి పటహ నాదం
బవ్యాహత మెందు వినఁగ నయ్యె భృశముగన్ 16

ఏమిది యను ప్రియరూపున,
కేమో, నేనేమి తెలియు దియ్యది యని, యా
శ్రీమంతుఁడు స్వానుచరున్
ధీమంతునిఁబనిచెఁదెలిసి, తెలుపుట కొఱకున్ 17

అనిన హసాదు దొరా! యని,
యనుచరుఁడుం బోయి వచ్చి, యానతుఁడగుచున్
వినయము నమ్రము సంభ్రమ
మును ముప్పిరిఁగొనఁగ, నా విభులకుం బలికెన్ 18

మలయధ్వజుఁడను భూమీ
వలయాధిపుఁడెసఁగు పాండ్యపద నాథుండై,
దళిత సపత్నుం డన్వయ
తిలకుం డతిసుందరుఁడు రతివిభున కన్నన్ 19

రాజీవాక్ష సమాన మానుఁడవు నా రాజన్యరత్నంబుచే
రాజన్వంతము దేశమొప్పెను దగన్, రాజార్ధమౌళిప్రభా
రాజ ద్రాజముఖీ దరస్మిత ఝురీరాజి ప్రతీకాశ వి
భ్రాజ త్కీర్తిలతా ప్రసూన నిచయారాజాత ధావళ్యమై 20

అప్పుడమితేని దేవేరి, యంగజుసతి
వెక్కిరించెడి సౌందర్య విలసనముల
నలరు పాయంపు శూరసేనాత్మజాత
యయ్యెఁ గాంచనమాల గుణాలవాల 21

పడఁతిమిన్నఁగూడి, పుడమితేఁడా సేతు
శీతనగము మేదినీ తలంబు,
వాసవుండు వోలె, పరిపాలన మొనర్చు
చుండె, సర్వసౌఖ్య మండితుఁడయి 22

ఆ నెలంత తోడ, నారాజ సురరాజు,
రాజమౌళి, రాజరాజ నమితు,
రాజ శైలజని విరాజ దర్ధాంగు, స
రోజములఁదమిం బ్రతిరోజుఁగొల్చు 23

శివసవము, శివధ్యానము,
శివపూజ, శివస్తవంబు, శివనామ స్మృతుల్
సవనమ్ముల మూటన్నా
ధవుఁడొనరించును దదేక తత్పరమతియై 24

ఆ నృపవంశమౌళికి, వియత్పతి తుల్యున, కబ్ధి మేఖలా
జానికి, దేహజాని దయజాలులఁజాలెడు వాని కేమిలో,
టైనఁదనూభవాననము నందిన నందము లేమి లేమి సం
తానము లేమి, లేమియెకదా! కలవారికి లేనివారికిన్ 25

ఆతఁడు సేయు సుతార్థము
చేతోభవహరు మనంబుఁజేరిచి, నిత్యం
బాతత జప దానాదుల
నా తలిరుంబోడిఁగూడి, యవహిత మతితోన్ 26

అలఁత నా రాయఁడొకనాఁడు వెలుఁగుతేఁడు
జలఁదనము వీడి, వేఁడెక్కు సమయ మందుఁ,
గాల కృత్యంబుల నొనర్చి, కాంతల కడఁ
బ్రొద్దు పుచ్చుచు, నీరీతిఁబొక్కఁదొడఁగె 27

ఆ నందనుండు కులమున
కానందనుఁడొకఁడెగాదె, యట్టి గుణాఢ్యున్

సూనునిఁగాంచని జనములు
సూనము విరియని కుజమ్ము చొప్పునగారే? 28

నోములు నోచమైతి మొకొ? నోచిన నోములు రిత్తవోయెనో?
మోమునఁదమ్మిచూలి సుతుఁబొందెద రంచు లిఖింపలేదొ? పె
న్గాములువోలె పాపములు కర్కశ వృత్తి ఘటింపఁజేయవే?
యేమన నేమొకో! మనకు నింతటి భాగ్యము భోగ్యమౌనొకో! 29

కలదే సద్గతి పుత్రహీనునకు? విఖ్యాతు ల్మహిం గల్గునే?
జలదానక్రియలం బితౄణము వినష్టంబౌనె, యత్యుత్తమం
బులు లోకమ్ములుఁ బొంద శక్యములె, సంపూర్ణంబె సౌఖ్యంబు నా
వల దప్పం జనునే మహానరకముల్? వర్ధంచనం జెల్లునే? 30

పుత్రః పున్నామో నర
కాత్త్రాయత యనుచు, నాస్తిగతి రేవాన్యా
పుత్రస్య యనుచు, ఁబెద్దలు
పుత్రప్రాశస్త్య మిట్లుఁబొగడరె యెందున్ 31

ఇట్లు చింతింపుచా మేదినీశ్వరుండు
చంద్రశేఖర చరణాంబుజాతములను
బత్తి నర్చింపుచుం, బ్రజాపాలనమ్ము
సలుపుచుండెను ధర్మైక సక్త బుద్ధి 32

అంత నొకనాఁడు మేదినీ కాంతు కలను
గానుపించెను శశిమౌళి కనికరమునఁ,
బుత్రకామేష్టి నొనరింపు పుత్ర! యనుచు
నుతుల సల్పెడు రాజు ననుగ్రహించె 33

నరపాలుఁడు శుభదినమున
పరమర్షులఁబిలిచి, హర్షవశుఁడై బొనరిం
చె రహిన్ సుతకామేష్టిని
శరదిందునిభాస్యఁగూడి, సద్విధి తోడన్ 34

అరవింద శరదిందు పరభాగ పరియోగ
మన, సొము నగుమోము హరువు మించ
చెవిసోకు తొవచేకుసిరి లాగికొన నేఁగు
ననఁజూపు కొనకోపు లతిశయిల్ల

మొగి బారులుగఁ బారి తగుతేటులకు దీటు
లన, ఁగప్పుకులు లొప్పుఁదనము గొనఁగ
మెఱుఁగానిన కడాని కఱకంచు హసియించు
నవఁబోని నునుమేను నవక మెసఁగ
త్రిభువనములందునేనిట్టి దివ్యరూప
కలుగునా యన, సౌందర్య విలసనములఁ
జాల మూఁడేండ్ల బాలిక కేలి కేలఁ
బొడమి యేతెంచె, చన్నులమూఁటగూడి 35

ఏతెంచి యా కుమారిక
భూతలపతిదేవి యంకభూమిం జేరెన్.
జేతం జేకొనె నామెయు
నాతత సవనంపు శుభ ఫలాప్తియ వోలెన్

ఆ మలయధ్వజుండు వికృతాంగి సుతంగని, బెంగనంద, నా
సామి శశాంకమౌళి ఖవచఃఫణితి న్వచియించె నిట్లు, మీ
నోములపంట యిద్ది సురనుత్య శుభావళిఁ బొందుమయ్య! యిం
కేమియుఁజింతనందకు మహీన మహీవలయంబు నేలుమా 37

మూఁడు చన్నుల వికృతంబు మూర్తి యనెదొ?
ధవునిఁగన్గొన లోపించు ధరణినాథ!
యనఁగ, నాతండు ముదమంది యమరనాథు
నానఁ బేర్వెట్టెను దటాతకాఖ్య నపుడు 38

లేక లేక గలిగె రాకొమరితె యని
యంక పదవిఁజేర్చు, నమిత బంధు
పాణితలము లందు పరివృత్తయగుచభి
వృద్ధినొందెను శశిరేఖ వోలె

అంతట ఁగొంతకాలమునకామలయధ్వజ భూమినాథుఁడ
త్యంత ముదంబెసంగ, ఁదన యాత్మజకుం గఱపించె సర్వశా
స్త్రాంత రహస్యధోరణుల, నాయుధజాల కలావిలాస మా
శాంత మహీచరిత్రము, గజాశ్వ రథాది గతిప్రచారముల్ 40

అన్నివిద్దెలఁబెద్దగ నారితేరి,
యాయుధమ్ముల నెఱి మించి, యఖిల వాహ

నాధిరోహణమునఁజాలి, యబ్జవదన
యల్లనల్లన యౌవన మధిగమించె 43

కుచ కటి కచ మధ్యంబులఁ
బ్రచురమ్ముగ బ్రధిమ గరిమ వక్రిమ తనిమల్
పచరింపంగంజేసె, వి
కచ యౌవన మేఁగుదెంచి కన్యకు నంతన్ 42

సవిశేషమ్ముగఁబ్రత్యవ
యవమున కొక క్రొత్త క్రొత్త యందంబెసఁగెం,
జివురుంబోఁడికి వికస
న్నవయౌవన మహిమ దోఁప నవకం బొప్పన్ 43

ప్రేమ నిగూఢ భావములఁబెంపగు చూపుల కోపు, నంకుర
త్కామ మహీరుహంబులనఁగాఁదగు నారుల సొరు, హేమ రే
ఖా మహితత్వ మొప్పెసఁగు కాయపుఁదల్కులఁగుల్కు, విస్ఫుర
త్తామరసాక్షికిం బొసఁగెఁదద్దయు నూతన యౌవనంబునన్ 44

భావభానా భాన భావితం దనుమధ్య
మధ్య మధ్యన సాము మధ్యమయ్యె
కుంభి కుంభమ్ములఁ గొసరించి పసమించు
స్తనమాన ముపమాన సన్నతిఁగనె
తొవరేకు జడమంచు తోపించు కనుదోయి
వ్యర్థమ్ము నత్యర్థ మాచరించె
సకల కలాధరు సకలంకుఁడని రోయ
మోము ద్వైతాభావ మామతించె
నేమి కలదింక వచియింప, నా మనోహ
రాంగి యంగన యంగమనంగు తూప
నంగ బంగరు రంగు సొబం గెసంగి
హంగు మీఱెను యౌవనత్వం గయునని 45

విమల సరుల విమిశ్రమై వెలయు మత్త
కాశినీ కేశపాశంబు కాంతిమీఱె,
నాకుసందుల నుండి సమాగతయవు
చంద్రికం గూడి పాదపచ్ఛాయ వోలె 46

తనను గని, ఫాలలోచన దహనకణిక,
కినుక మొనకొని బూదె చేసిన మహేశు,
గట్టి వైవంగఁబూనిక పట్టి, సేసె
ముదిత జడపేరి యురిత్రాడు మదనసుదతి 47

కూడెను నెక్కురుల్ త్రికముగొబ్బున, లోచన పద్మపత్రముల్
గూడె శ్రవస్థలిన్, గనక కుంభ విజృంభములౌ నురోజముల్
గూడెఁబరస్పరంబు, జతగూడెను చందము నందముల్, వెసం
గూడె ననంగు కార్ముకపుఁ బోటికిఁ దేఁటులబారు నారిగన్ 48

ముద్దియ నవయౌవనపుం
బద్దునఁజిఱుపాన యిడిన పంచశరాస్త్రం
బద్ది యవ నుండ, జనకుఁడు
దద్దయుఁబెద్దయయి కాలధర్మము నొందెన్ 49

తల్లి కాంచనమాల సంతప్త యయ్యు
ధర్మ్యముగ భర్తృసహగతిఁదలఁగె మేను,
వ్యసనమందియు నోర్చి, యాపద్మనేత్ర,
యధిప తంత్రము నడపె సామర్థ్య మెసఁగ 50

నన్ను జయించినట్టి నరనాథ కులోద్వహుఁ బెండ్లియాడుదుం
జెన్నెసఁగంగనంచు నెదసేసెఁబ్రతిజ్ఞ, మహానుభావ! యీ
తెన్నున నుర్వరన్ సమర భీరుల రాజులనెల్ల గెల్చి ది
వ్యోన్నతి వాల్చి, వచ్చెను ప్రభూ! మధురాపురనాథు మీఁదికిన్ 51

ఆ సుందరీ మతల్లిక
నాసీరమునం జెలంగు నానావిధ భే
రీనాదము, దేవరయ ప్ర
మాణంబని యుడిగె నతఁడు, మధురేశజుఁడున్ 52

ఔరా! మిత్రమ! వింటె చిత్రమిదిగాదా చూడఁగా సుందరీ
చారిత్రం బిదియెల్ల, యింతియఁట! రాజ్యంబెల్ల బాలింపనౌ
వీరాగ్రేసరయంట! భూమిఁగల పృథ్వీనాథ దేవేంద్రులం
బోరంగెల్వఁగఁజాలు శూరయఁట! యీ పూబోఁడి వీక్షింతమే 53

రణమున గెల్చునంట మధురాపురనాథుని, బంతులాటలో,
వనమున సంచరించుటలొ, వారివిహార వినోదలీలలో,

ప్రణత దిగన్త రాణ్మకుట రత్నఘృణీ పరివేష్టితాంఘ్రి ప
ద్మని మధురాధిపు న్సమరభూమిక నోర్చుటలన్న మాటలే? 54

భూమీశానుల నెల్లరం గెలిచె నా పూబోఁడి, యట్లైన నా
భామాబాహుపరాక్రమ క్రమము దర్పంబెల్లయున్, ఘోరసం
గ్రామంబందెదిరించి కాంచవలె, మిత్రంబా! కరంబు న్మన
స్సీమం గౌతుక మెచ్చె నంచచటు వాసె న్వెంట నాతండు రాన్ 55

అశ్వవరముల నెక్కి వీరాగ్రసరులు
పరిజనానీత కోదండ పాణు లగుచు,
నెదురువోయిరి దర్పంబు నెసక మెసఁగ
భూరి ఘోరార్భటీ చమూసమూహమునకు 56

ఆ నరపాలకుమారులు
సేనా వ్యూహమ్ము గాంచి, చిత్తమ్మలరం
గా, నిర్భయరీతిం బర
సేనం జొరఁబాతి రరులు చేష్టలు దక్కన్ 57

పటు మణీ ఘటిత దివ్య స్యందనముదాని,
మించు పొబంగు నెమ్మేని దానిఁ,
దృప్త భీకర మృగాధిప కేతనము దానిఁ,
జెలఁగు నాకేకర శ్రీలదాని,
బాణ బాణాసన వ్యగ్రపాణులదాని,
వీరస్మితంబున వెలయుదానిఁ,
జారులీలాధీన చటుల భ్రుకుటిదాని,
గురువింద కలిత శేఖరముదానిఁ,
దత తనుత్రాణ సంవృత తనువు దానిఁ,
గమల చంద్రుల గెల్చు మొగంబుదాని,
వీర శృంగార రసమున వెలుఁగు దాని,
మానినీమణిఁగాంచి, రమ్మానధనులు, 58

కాంచి యొకఁడు మోదాశ్రుకణ మణిఘృణు
లరణ మిడ, ఁజెల్లిఁజూచిన యట్ల చూచె,
నన్యుఁడౌదల వంచి, యర్ధానుభూతి
మనమున నుదార రీతి నెంచెను నిముసము 59

అవురా! పక్ష్మలనేత్ర దక్షతనయా హార్య స్ఫురద్రూప, మా
యవనీభృద్వర కన్యకామణి విలాసాసాంగ లాలిత్య, మీ
డవునా? తోడవు గాక యన్య తదపాంగాలోక-హేవాకితన్
జివురుల్ గొల్పెడి మన్మనోరథలతా సీమంత సీమాంతముల్ 60

ఈ విశాలాక్షి నర్ధాంగి నెనయనేనిఁ,
దలఁపఁదను వర్థమగును సార్థమ్ము గాదు
ఈ తలోదరి చెంతలేదేని, యింక
మారుని జయించి యేనెట్లు పేరుఁ గాంతు 61

అనుచు నద్భుత మరుసమ్ముఁబెనుప, నిముస
మనిమిషత్వము నంది, యంతనె మదిఁ గొని
ధీరుఁడా మధురేశ కుమారుఁడిట్లు
పలికెఁబ్రియరూపు నభిరూప ఫణితిదోఁప 62

సౌర జనతా కిరీట కోటీర దామ
దివ్య మకరంద బిందు నందిత పదాబ్జ
నియతి వశమున నవని జన్మించె నేమొ,
పడయునే? కానియెడ నిట్టి భవ్యలీల 63

చారుముఖి వీరశృంగార శైలిఁజూడ
స్వాంతమిది సంగరమున కుత్సాహ మెనసె,
నొక్క గడెలోన సేనా సమూహ మెల్ల
సమయ జయసీమ మనపయి సక్తిఁగొనదె! 64

ఇంతియేకద, యిందు మీకేల శ్రమము?
బావగారూ! రవంత యాప్రక్క నిలిచి,
కనుఁడు, సత్వమునిడు నపాంగముల గములఁ
జాలి ముక్కంటిఁదలపింపఁజాలుదు నిదె 65

అని మధురేశ కుమారుం
డనితర వేద్యమగు శైలి, నాప్తుని మనముం
గొని, మరలిచి, యా వీరాం
గన యరద మ్మెదిరి మధురగతి నిట్లనియెన్ 66

ఎవ్వతె వీవు, ముగ్ధహరిణేక్షణ! యింతటి సాహసంబె! లే
జవ్వని వీవు, సంగరపు సంగతులా? చివురాకుఁ బోని నీ

మవ్వపు నంఘ్రులంటు గరిమంబుల దువ్వలు పద్మరాగపుం
గువ్వల దోచెడున్, దగునొకో ఘన కోప పటు భ్రుకూటముల్ 67

చెఱకు సింగిణిఁదాల్చు వెఱవు దోఁచెడి కేలఁ
జటుల మౌర్వీ సమాస్ఫాలనమ్ము
వెన్నెలన్ జింద నొప్పెడి యపాంగములలో
సాంద్ర రోషోగ్ర కింజల్క కాంతి
స్మరవైరి ధైర్య మర్మము చించు రూపులో
వీరశృంగార సంస్కార కలన
మైశ్వర్యలాలన కనువైన నెమ్మేనఁ
గఠిన తనుత్రాణ గహన గుప్తిఁ
జాలి ముల్లోకముల నేలఁజాలినట్టి
మురిపెముల దిగ్విజిత్వర స్ఫురణ, మేల
తొందరలు, చాలుచాలు పూదోటలా మ
హాహవమ్ముల బాటలకగునె యబల! 68

మానిత పూర్వపుణ్యగరిమంబుల, దివ్యతపః ప్రపత్తులన్,
మానిని! చూరగొంటి వభిమాన, మనూన మహీమహీశుఁడన్
సూనశరాసు నేని నొక చూపున గెల్చిన వాఁడ, నీగుణా
ధీనుఁడనైతి, నాహవమతి న్విరమింపు, మరాళ కుంతలా! 69

అని సాకూతముగా, సవిస్మయముగా, సానంద హేలంబుగా,
పనికారంబుగ, సావహిత్థముగ, సేర్ష్యా స్ఫూర్తిగా, సానురా
గ నిగూఢంబుగఁబల్క, నా సుదతి వీక్షాపాళు లా వీర హీ
రున కాతిథ్యముఁ గూర్ప నిట్లు తలఁచెన్ రుంద్ర త్రపాధీరయై 70

ఈ రస రాజశేఖరుల నెందఱనో విషయాధినాథులన్
బోరి జయించి, చిద్రస విభుత్వము లేదని, కాదటంచు, నీ
పూరుషు ముంజరేఖికల వొల్చు నిషీకమ వోలెఁగాంచి, వ్యా
పారము దక్కె నామనసు, బాపురె! వీనిమహత్వ మెట్టిదో! 71

ఘనత గంటిని, హృదయ వికారమణఁగె,
దివ్యవాణీ ప్రకారంబు తేట వడియె,
సందియములేదు, వరణీయ సత్వు, ఁడోటుఁ
జెల్లు నిటనంచు, తగవెంచి చెలువ పలికె 72

వీరకిశోరమా! కుశల విక్రమ! సంతసమయ్యె నిన్నుఁ గ
న్నారఁగఁగాంచ, నభ్యుదయ మయ్యెడు నీదు నళీక శౌర్య దు
ర్వార వృథామదోద్ధుర పరాక్రమ లీలకు, రాకరాక యీ
నారి నెదిర్చి పేర్చిన రణంబున నోటమి రాక మున్నుగన్ 73

అనుచు వీరస్మితాంకుర మాననమునఁ
దెలివిఁగొన, సైన్యభూమి నతిక్రమించి,
దవ్వుదవ్వుల ద్వంద్వయుద్ధప్రకార
సమధి కోత్సాహమున వీరచంద్రుఁదాఁకె 74

వనజాప్త బింబమై, వనజారి చందమై,
వనిత ముద్దుమొగంబు వఱలు చుండఁ
బ్రళయాంత మేఘమై, ప్రావృట్పయోదమై,
ముదిత కైశికము సొంపులు రహింప
బిసకాండ వల్లులై, విషకంఠ వల్లులై,
గరిత బాహుయుగంబు గ్రాలుచుండ
మున్నీటి ముంపులై, పన్నీటిజల్లులై,
పొలఁతి యపాంగముల్ పొంగి పారల
గ్రీష్మభీష్మ తపములు చంద్రికల ప్రోవు
లై, కలావతి చిరునవ్వు లతిశయింపఁ,
దుర మొనర్చెను రాజశేఖరుని తోడ
వీరశృంగారలీల ముప్పిరిఁ గొనంగ 75

సవ్యాపసవ్య శస్త్రప్రయోగ నిరూఢి
సారసేక్షణ సవ్యసాచి యయ్యె,
వైరి సేనార్ణవో ద్బంధనోద్ధత లీల
చకితమృగాక్షి దాశరథి యయ్యె,
విమత భూభృత్పక్ష విచ్ఛేదనక్రీడఁ
బక్ష్మలేక్షణ వజ్రబాహువయ్యె,
నహిత శిక్షణ కలా హంతా రసప్రౌఢిఁ
దరళలోచన చక్రధారియయ్యె,
దుర్దలిత దుష్ట శాత్రవ స్తోమ శౌర్య
దర్ప నిర్వాపణానల్పతా ప్రదీప్తిఁ

గమల దళనేత్ర యున్నిద్రకాళి యయ్యెఁ,
బుష్కర దళాక్షి రౌద్రదంభోళి యయ్యె 76

కువలయాక్షి యపాంగ కోణముల్, కల్హార
శోణముల్, దహన నిష్ఠురతఁదాల్చె
లలితాంగి కైశ్య కలాపముల్ ఘన తమో
ద్వీపముల్, పర్జన్యధృతి వహించె
చారుమధ్యమ స్మితాంకూరముల్, ప్రళయాబ్ధి
పూరముల్, సౌరవిస్ఫూర్తిఁదనరె
మదిరాక్షి నిశ్వాసమాలికల్, పటుకోప
కీలికల్, పవమాన ఘృష్టి నెసఁగె
వెలఁది లలితాంగ భంగిమల్, విజయసిద్ధి
రంగముల్, మోహనాస్త్ర విభ్రాంతి మిగిలె
నతివ యురు సింహనాదము, లాశ్రితప్ర
సాదముల్, వైరివిక్రమో త్పాదులయ్యె 77

ఇవ్విధంబున నిఖిలాస్త్ర హేతితతుల
నపర దుర్గయనా సమరాంగణమునఁ
గొమ విజృంభింప, రౌద్రవిక్రముఁడు నోర్చి
దివ్యశరమొండు వింట సంధించి తివిచె 78

ప్రళయ స్ఫూర్జ దుభీషణస్ఫురణ గర్జాఘోర ధారాధరో
చ్చలితే రమ్మద పూరముల్, చటుల ఝంఝామారుతవ్రాత సం
ష్ఠుల సంవర్త మహోహుతాశన శిఖా జ్యోతుల్, దెస ల్పర్వ ను
జ్వల మా యస్త్ర మురంబునన్ దరియ, నా వామాంగి లేనవ్వుతోన్ 79

శర శరాసనముల, నరదమ్ముపై నిడి,
శక్తి యోగపరత క్షణ మొకండు
గొని సుదర్శనాను కలనా ప్రణిధాన
మూర్తి యగుచు, విద్రుమోష్ఠి యంత 80

జగదజేయమ! నతశుభాస్పదమ! పాశు
పతమ! దివ్యాస్త్రరాజమా! నతులుగొనుమ!
సౌమ్యరూపము గనుమ! ప్రసన్న మగుమ!
యనుచు వినుతించి తలవంచి యంజలించె 81

ఆ దివ్యాస్త్రము దుర్దాం
తోదిత కీలాస్వనంబు లొక్కుమ్మడి ను
త్పాదమ్మొనయఁగ దరిసి, ప్ర
సాదగతిం గరపుటములఁజయ్యన చేరెన్ 82

కనుల నద్దికొని, వికస్వరాక్షి ప్రమోద
గౌరవానురాగ పారవశ్య
మేదురాంగి యగుచు, మెచ్చి, మందార దా
మంబుఁజుట్టి, మ్రొక్కి, మఱలఁబుచ్చె 83

మహితశరము మరలి మందార మాలిక
నధిపు కంఠసీమ ననువుపడ న
లంకరించి, తైజసాంకూరమై ప్రద
క్షిణము గొని, యదృశ్యతను బొసంగె 84

సౌమనస్యాత్మసిద్ధి ప్రశస్తమైన
వనిత పుణ్యచరిత్ర మేమనఁగ వచ్చు?
స్థిర సుఖాప్తిఁదదాసక్త చిత్తులెపుడు
నిర్జరులు గొల్చుచుందు రా నీరజాక్షి 85

అరుసముఁగూర్చు సొమ్ము గడు నందము గందముఁజిల్కినట్టు, లీ
చెరువు నిజంబు పేరుగల చిన్న కయీసరుఁడిట్లొనర్చు చా
ల రవణ సుందరేశ్వర విలాసము నాఁదగుఁదెల్గు కబ్బమం
దరిగెను గెంపు మైదవది తద్దయుఁ బెద్దలుఁబెద్దసేయఁగన్

శ్రీః



98



మూక పంచశతి

మూలమ్: శ్రీ మూక మహాకవి

1 ఆర్యా శతకమ్

అర్థతాత్పర్యవివరణ - శ్రీ దోర్బల విశ్వనాథశర్మ

2. పాదారవింద శతకమ్ రు.10/-

అర్థతాత్పర్యములు - శ్రీ యస్. పి లోకాచార్యులు

3. కటాక్ష శతకమ్ రు.15/-

అర్థతాత్పర్యవివరణ - శ్రీ దోర్బల విశ్వనాథశర్మ

4 స్తుతి శతకమ్ రు.10/-

ప్రతి పదార్థము - శ్రీ వి. ఏ. కుమార స్వామి

5 మందస్మిత శతకమ్ రు.15/-

అర్థతాత్పర్యవివరణ - శ్రీ దోర్బల విశ్వనాథశర్మ

ఇతర ముద్రణలు

1 శ్రీ శివ మానసిక పూజాస్తుతిః - శ్రీ సదాశివ బ్రహ్మేంద్రుడు రు.10/-

అర్థ తాత్పర్య వివరణ - శంకర కింకరుడు

2. ఆత్మ విద్యా విలాసము - శ్రీ సదాశివ బ్రహ్మేంద్రుడు రు.15/-

తాత్పర్యము - వివరణ - శంకర కింకరుడు

3 శివమీడేస్తవః - హరిణీ వ్యాఖ్యానము రు. 8/-

అర్థతాత్పర్యవివరణ - శ్రీ దోర్బల విశ్వనాథశర్మ

4 శ్రీ మహిషాసుర మర్దినీ స్తోత్రము - శ్రీ రామకృష్ణ కవి రు. 4/-

అర్థ తాత్పర్య వివరణ - శంకర కింకరుడు

5. అమరుకము - అమరుక కృతము (శ్రీ శంకర భగవత్పాదులు)

అర్థతాత్పర్యవివరణ - శ్రీ దోర్బల విశ్వనాథశర్మ

సాధన గ్రంథ మండలి, తెనాలి

